# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.
సంపాదకుడు :
ఆంధ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౫. ఈశ్వర, జ్యేష్ఠము : జూన్, 1937. సంచిక : ౧౧.


## సంపాదకీయ సమాలోచన

**౧. పల్లెపట్టులందు మోటారులారీలు :—**

మోటారుబస్సులరాక విదేశములకు ధనమును ప్రవాహమును కట్టించునదే అయినను కొంతవరకు పల్లెటిపట్టులందు ప్రజలకు ప్రయాణసౌకర్యములను కల్గించినదని అంగీకరింపక తీరదు. ఇప్పుడు పల్లెటిపట్టులందు సరుకును మోసుకొనిపోవుటకు మోటారులారీలు ఉపయోగమునకు వచ్చుచున్నవి. బెజవాడ జిల్లాబోర్డువారు ఇటీవల ఎక్కువ లారీలకు లైసెన్సులుకూడ ఇచ్చియున్నారని వినుచున్నాము. లారీలవలన రోడ్లుపాడగుట; ప్రమాదములు మితిమీరుట; లారీలకు, స్పేరుసామానులకు, రిపేర్లకు, టైర్లకు, ట్యూబులకు, పెట్రోలుకు విదేశములకు ధనము ప్రవాహమైపోవుట మున్నగు పెక్కునష్టములున్నవి. వాని ఉపయోగముముందు ఈనష్టము లంత లెక్కలోనివి కావనుకొనినను బాడుగబండ్లను తోలుకొని బయటపడుచున్న రైతులనోటియందు ఈలారీలు దుమ్మికొట్టుచున్నవి. పండినసరుకుకు ధర లేక; పన్నులు, కట్టుబళ్లు ఇచ్చుకొనక తప్పక అటమటించుచున్న రైతునకు బాడుగబండ్లు తోలుకొనియైన నాలుగురాళ్లు కండ్లచూచుటకు వీలులేకుండ పోవుచున్నది. సగటున నాలుగు లేక ఐదు యకరములను మాత్రము దున్నుచున్న మనరైతులకు తమతమ వ్యవసాయపు పనులకు ఈలారీల అవసరము ఏమాత్రమేని ఉండునా? ఎటుచూచినను లారీలు రైతునకు నష్టము కూర్చునవిగనే యున్నవి. కావున వీనిని నిషేధింపజూచుట రైతుసంఘముల ప్రథమ ప్రధానకర్తవ్యము.

**౨. రఫ్ కాగితము ధరలో పెరుగుదల :—**

ఈనడుమ రఫ్ కాగితము ధర దాదాపు రెట్టింపుఅయినది. రఫ్ కాగితమును విస్తరించి ఉపయోగించునది పత్రికలు. విద్యావిషయమున మిక్కిలి వెనుకబడియున్న భారతదేశమున ప్రతి పత్రికయు ఉపాధ్యాయునివలె ఉపయోగించుననుట అతిశయోక్తి కాదు. అట్టి ఉపయోగకరమైన పత్రికలకు పీడాకరముగనున్న రఫ్ కాగితములధర పెరుగుదలను కొంతవర

కైన తగ్గించుటకు ప్రభుత్వమువారు సాయపడవలసియున్నది. రఫ్ కాగితము మనదేశమున తయారగునదికాదు. విదేశములనుండి దిగుమతికావలసియున్నది. దానిపై దిగుమతిసుంక ముగలదు. ఆసుంకమును తీసివేయుచో కాగితముధర కొంతవఱకు తగ్గగలదు. ఈవిషయమై దేశమున కొంత ఆందోళన జరుగుచున్నది. ఆ ఆందోళన ప్రభుత్వమువారి ఆలోచనకు అందినది కూడను. ప్రభుత్వమువారు శీఘ్రనిర్ణయమునకు వత్తురుగాక!

**౯. పూనాలో సత్యాగ్రహము :—**

పూనాలో స్వర్ణమారుతీదేవాలయముముందర సాగిన హిందువుల సత్యాగ్రహములో అరెస్టులేగాక లాఠీప్రయోగములుకూడ జరుపబడినవి. ప్రొవిన్షియల్ అటానమీ వచ్చినను పోలీసువారి లాఠీలు యథారీతినే విహరించుచున్నవి. ఈదేవాలయమున జేగంట కూడ వాయింపరాదని మహమ్మదీయులు అభ్యంతరపెట్టుటయు, దానికి అనుగుణముగ మేజస్ట్రేటు ఉత్తరువుచేయుటయు విచిత్రముగనే యున్నది.

**౯. జాంజిబారు భారతీయులదురవస్థ :—**

దినదినమును అతిశయించుచున్నదేకాని ఏమాత్రమును డిందుపాటొందుటలేదు. అచ్చట క్రొత్తగ ప్రవేశపెట్టబడనున్న రైతుఋణవిముక్తిచట్టమువలన భారతీయులు ఆ దేశమున భూమిసంపాదించుటకు వీలులేని పరిస్థితి యేర్పడుచున్నది. దీనివిషయమున దేశమున విశేషమగు ఆందోళన సాగించి జాంజిబారు భారతీయుల ఇక్కట్లను తొలగింపవలసియున్నది.

**౯. మదరాసుకాలేజీకమిటీలు : బ్రాహ్మణులు :—**

మదరాసునందలి కాలేజీలలో విద్యార్థులను జేర్చుకొనుటకు సలహాఇచ్చుటకు ఇంటిరిమ్‌మంత్రివర్గమువారు ఏర్పరచిన కమిటీలలో బ్రాహ్మణులకు ప్రాతినిధ్యమేలేకుండ చేసిరి. బ్రాహ్మణులు మైనారిటీశాఖగదా? మైనారిటీశాఖకు ఒక్కకాలేజీ కమిటీయందైనను ప్రాతినిధ్యముండరాదా? మైనారిటీశాఖలకు తగురక్షణయుండదేమో అను భయమొకటిగదా గవర్నరు కాంగ్రెస్‌వారికి హామీలు ఈయకుండుటకు కారణము?

**౯. కీ. శే. వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు:—**

కొవ్వూరునందలి ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమునకు ప్రాపైయుండిన వల్లూరి సూర్యనారాయణరావుపంతులుగారు 28-4-37 తేదీని దివంగతులైరి. మరణకాలమువాటికి వీరికి డెబ్బదిసంవత్సరములు నిండినవి. గోదావరికృష్ణామండలములందలి ప్రజాహితతత్పరులగు నాయకులలో వీరొకరు. న్యాయవాదిగా వీరిఉనికి బందరుపట్టణమున. దేవాదాయధర్మాదాయ దుర్వినియోగమును అరికట్టుటలో వీరు విసుగుఅనునది యెఱుగక కృషిసలిపిరి. వీరు తమ కడకాలమునంతను కొవ్వూరునందలి ఆంధ్రగీర్వాణవిద్యాపీఠక్షేమమునకై వెచ్చించి ధన్యులైరి. శ్రీవారి ఆత్మకు శాంతికలుగుగాక!

౯. వినాయక దామోదర సవర్కారు విడుదల :—

భారత దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును సాధించుటకు సాయుధవిప్లవమును లేవదీయుటకు కుట్రపన్నినను నేరమునకు 1910-వ సంవత్సరమునుండి నిర్బంధశిక్ష ననుభవించుచున్న వినాయక దామోదర సవర్కారును మే 11-వ తేదీనాడు రత్నగిరిజిల్లా మేజస్ట్రేటు విడుదలగావించెను. 'భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర' రచయితయగు ఈవిద్యాధికుని విడుదల పట్టాభిషేకసందర్భమున భారతప్రజకు ఈయబడిన వరములలో నొకటి యనవగును. ఈ విషయమున ప్రభుత్వము ఇప్పటికైనను ఉదారహృదయము చూపినందులకు సంతోషింపవలసియున్నది.

౯. టాటా కంపెనీ : కార్మికులు :—

భారత దేశమునందలి ఇనుము ఉక్కు కంపెనీలలో మిక్కిలి పెద్దదియగు టాటా కంపెనీవారు తమ కార్మికులయెడ అవలంబించుచున్న విధానము చాల ప్రశంసనీయముగ నున్నది. గతవత్సరమున కంపెనీవారు తమ నికరపు రాబడినుండి 20 లక్షల రూపాయిలను కార్మికులకు ఈనాముగ పంచిపెట్టిరి. పనివాండ్రకు కంపెనీలాభములో కొంత పంచియిచ్చు ఇట్టి పద్ధతి కార్మికులలో అసంతృప్తి వ్యాపించకుండ కాపుదలగ నుండును. ఇట్టి పరిశ్రామికసంస్థల జయమునకు కార్మికులతృప్తి మూలాధారము. ఈసూత్రమును గుర్తించిన కంపెనీ యజమానుల దూరదృష్టి కొనియాడదగినది.

౯. ఖద్దరు ధారణ : జైనస్వామి దీక్ష :—

యావద్భారత దేశమున జైనమతస్థులలో విశేషగౌరవముగల జైనగురు మహారాజా వారు 'ఇకమీఁద మీరందఱు ఖద్దరు ధరింపవలెనని నావాంఛ. ఖద్దరుధరింపని మార్వాడీ చేయు భిక్షను నేను స్వీకరింపను' అని బెంగుళూరులో ఒకసభలో ఉపన్యసించెను. ఇట్టి దీక్షలు దేశహితకరములు. ఈజైనస్వామి ఉచితజ్ఞత మెచ్చదగినది.

౯. బ్రాహ్మణేతర కవిసమ్మేళనము :—

తెనాలి సూతాశ్రమములో మే 23-వ తేదీని జరిగిన బ్రాహ్మణేతరకవిసమ్మేళనము (రాజకీయరంగమునవలె) కళారంగమునకూడ సంఘవైషమ్యమును తెచ్చిపెట్టునదిగానున్నదనువారితో మేము ఏకీభవింపలేము. బ్రాహ్మణకవులు ఒకప్పుడు బ్రాహ్మణేతరకవులను, వారికవిత్వమును అధిక్షేపించియుండిరి. అగుట బ్రాహ్మణేతరకవులు ఇపుడు బ్రాహ్మణకవులను వేఱుచేయుచో దెబ్బకుదెబ్బ అను నీతిలో దానిని తప్పుఅనుటకు వీలులేదు. ఇంతకును ఈ బ్రాహ్మణేతరకవిసమ్మేళనము బ్రాహ్మణేతరకవితాప్రాచుర్యమునకు ప్రాధాన్యమిచ్చినది కాని బ్రాహ్మణకవుల చెంగనాడు పనికి పూనలేదు. ఏమగుగాక విశ్వజనీనమగు కవిత్వము బ్రాహ్మణబ్రాహ్మణేతరవిభేదములకు అతీతమని తెలిసికొనవలసినయున్నది.

౯. కొత్తపట్టణము లాఠీ చార్జీ : ప్రభుత్వము వారి పచ్చి అబద్ధము :—

కొత్తపట్టణమున నెలకొల్పబడిన ఆర్థిక రాజకీయపాఠశాలను నిషేధించి పోలీసువారు

కావించినలాఠీచార్జీ చాల అక్రమమైనది. అరెస్టుకోరి నిలచియున్నవారిపై బలప్రయోగము గావించుట పశుబలప్రదర్శనముగాని అన్యముకాదు. తిరుగబడినవారిని అరెస్టుచేసి తీసికొని పోవుటకు అవసరమైనంత బలప్రయోగమే జరిగినదికాని అధికముగ జరుగలేదని ప్రభుత్వము వారు పలుకుట పచ్చి అబద్ధమాడుట అనకతీరదు. నడుమంత్రపుమంత్రులకు ప్రజాహితకాంక్షయేగాక సత్యప్రియత్వముకూడ లేదని ఇందుమూలమున స్పష్టమైనది. ప్రజలకు బాధ్యులు కాని ఈమంత్రులు ప్రజలపై బాధ్యతయెఱుగక ఇట్లు చర్యజరుపుట వింతకాదు.

**౯. కీ. శే. కట్టమంచి కోళందరెడ్డిగారు :—**

బెజవాడయందలి క్రిమినల్ లాయర్లలో ప్రముఖులును కృష్ణామండలపు రైతునాయకులలో నొకరును, మునగాలరాజావారి వియ్యంకులును అగు కట్టమంచి కోళందరెడ్డిగారు 7-5-37 తేదీని మరణించిరి. ఆనాడు కోర్టుపనిచూచుకొని వడదెబ్బకు గుఱియై సునాయాసముగ మరణించిరి. తత్వమున జస్టిసుకక్షకుచెందియు వీరు రైతుసేవలో మిక్కిలి ఉదారులును, ప్రగమనశీలురును అయియుండిరి. వీరుకొంతకాలము బెజవాడ మునిసిపల్ ఛెయిర్మెన్నుగను, మదరాసుశాసనసభాసభ్యులుగను ఉండిరి. వీరి మరణమువలన కృష్ణామండలమునకు వాటిల్లిన కొరత కొలది ఇడరానిది.

**౯. వెంకటకృష్ణారెడ్డిగారి ఆంధ్ర సినేటు సభ్యత్వము :—**

నెల్లూరుమండలమునకు చెందినవారును, ఆంధ్రభూమి పాఠకులకు చిరపరిచితులును అగు శ్రీయుత దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయపు సినేటున సభ్యత్వమును బడసినందులకు వారిని మనఃపూర్వకముగ అభినందించుచున్నాము. నిరంతర కావ్యగోష్ఠీప్రియులగు శ్రీ రెడ్డిగారు సినేటున ప్రవేశించుట భాషాప్రియులకు ముదముగూర్చు విషయము. రెడ్డిగారికి ఆంగ్లభాషరాదను నెపమున వారిని ఆంధ్రసినేటుకు సభ్యులుగ పంపరాదని నెల్లూరులోని జస్టిసుపత్రికయగు 'స్వతంత్ర' యొక విడ్డూరపువాదమును లేవదీసినది. కాని ఆవాదము అరణ్యరోదనమై పోయినది. భారతదేశమున భాషాప్రయుక్త విశ్వవిద్యాలయములలో ఆదిదియగు ఆంధ్రవిశ్వవిద్యాలయమున ఆంగ్లమురాని ఆంధ్రులు సినేటు సభ్యత్వమునకే పనికిరారని వాదించుట ఆంధ్రవిశ్వవిద్యాలయనిర్మాణములోని ఆంతర్యమునే గుర్తింపకుండుటయగును. మఱియు పలుభాషాప్రదేశములకు చెందిన మదరాసు రాజధాని శాసనసభయందే ఆంగ్లమురానివారు సభ్యులగుటకు అర్హులైయుండగా ఏకభాషాప్రదేశమునకు చెందిన విశ్వవిద్యాలయపు సినేటున ఆ ఆవరణలోగల భాషలో పండితులైనవారు ఆంగ్లమురాని కారణమున సభ్యులుకాకూడదనుట కొసవెఱ్ఱివాదముగాక మఱియేమి? ఇట్టి కొసవెఱ్ఱికి లొంగక కృష్ణారెడ్డిగారిని ఆంధ్రసినేటుసభకు పంపిన నెల్లూరు స్థానికసంస్థల ఓటర్ల అగ్గలమగు ఆంధ్రాభిమానమునకు జయవెట్టుచున్నాము.

**౯. జాయింటుపట్టాలు : రైతులబాధలు :—**

ఏప్రియల్ 21-వ తేదీని బాపట్లతాలూకా రైతుసభలో ఆమోదింపబడిన జాయింటు

పట్టాలతోనున్న రైతులను గ్రామోద్యోగులబాధలనుండి తప్పించుకొనుటకు అప్లికేషను లేకుండా విధిగా పట్టాలు విడదీసి ప్రభుత్వంవారు యిప్పించవలెను.' అను తీరుమానము ప్రభుత్వమువారి పరిశీలనకు పాత్రము కాదగియున్నది. జాయింటు పట్టాలమాటున గ్రామోద్యోగులు పన్నునంతను ఒకేరైతునుండి దండుటయు, జాయింటు పట్టారైతులకు పన్నులెక్క సరిగచెప్పక అందరిదగ్గర అదనముగగుంజుటయు జరిగించుచున్నారు. రైతుక్షేమమే ప్రధానముగ నెంచుచో ప్రభుత్వమువారు ఈ అక్రమమును ఎంతత్వరగ తొలగించిన అంతమంచిది.

౬. సర్. కూర్మా వెంకటరెడ్డిగారి మంత్రిత్వము :—

శాసనసభాసభ్యత్వములేకపోయినను గవర్నరు పిలుచుటతడవుగా రెడ్డిగారు మంత్రిత్వమును వహించిరి. కాని ఈయన మంత్రిత్వమునకు ఒక్క రాజకీయకక్షియు ఆమోదము తెలిపియుండలేదు. కాంగ్రెస్‌వారి నిరసనమునకు అంతమేలేదు; సభ్యులుకానివారిని మంత్రులుగా నియమించుట అశాస్త్రీయమని జస్టిసుపార్టీవారు ప్రత్యేకముగ తీరుమానించిరి. రాజ్యాంగము ఈ మంత్రులకు ఇచ్చుటకంటె గవర్నరే స్వయముగ రాష్ట్రప్రభుత్వమును సాగించుట ఉత్తమమైయుండునని యూరపియన్ సభ్యులు సాటిరి. తన మంత్రిత్వమున సమర్థించుచు రెడ్డిగారుచేసిన స్టేటుమెంటు చాల అసంతృప్తికరముగనున్నదని కీత్ పండితుడు ముక్తకంఠముతో పలికెను. ఇందఱు ఇట్లు అనుచున్నను, ఎవరును ఎట్టిసానుభూతియు చూపకున్నను మంత్రిత్వమును నిర్వహించుచున్న సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారి మొండితనమును మెచ్చుకొనవలసియున్నది.

౬. భారతీయ సైనికదళమునకు పరాభవము :—

పట్టాభిషేకమహోత్సవము సందర్శించుటకై ఇంగ్లండువెళ్ళిన భారతీయ సైనికదళము బ్రైటన్‌నగరము చేరినప్పుడు అచటి కార్పొరేషనువారు ఇచ్చు స్వాగతసందర్భమున ఆ కార్పొరేషనుసభ్యులలోని స్త్రీలు రాకుండ పురుషులుమాత్రమే వచ్చుటకు తీరుమానించుకొనిరి. హిందూదేశమున ఉద్యోగములుచేసి ఉపకారవేతనములు పుచ్చుకొనువారు పలువురు బ్రైటన్‌నగరమున స్థిరపడుదురు. అట్టివారు భారతీయసైనికులకు గౌరవపూర్వకముగ ఎట్లు స్వాగతమీయగలరు? తమ్ము పాలించుచున్న ఆంగ్లజాతిస్త్రీలవల్ల స్వాగతము బడయుటకు భారతసైనికులు ఏపాటివారు? బ్రైటన్ కార్పొరేషను సభికురాండ్రు స్వాగతోత్సవమునకురాలేదు. భారతీయసైనికదళమువారు ఇది తమకు పరాభవముగ భావించిరి. అందుపై బ్రైటన్ డిపూ్యటీమేయరు భారతీయసైనికదళములో స్త్రీలులేని హేతువచే స్త్రీలు విందులో పాల్గొనుట భారతీయులకు మర్యాదకాదేమోనని బ్రైటన్ కార్పొరేషను స్త్రీలు స్వాగతోత్సవమునకు రాలేదని సమాధానము చెప్పెను. ఈసమాధానము సమంజసముగా నున్నదా? సైనికదళములో స్త్రీలు ఉండరనువిషయము బ్రైటన్ కార్పొరేషన్ డిపూ్యటీమేయరుకు తెలియదా? తెలియకేమి? ఏదోసమాధానము చెప్పవలయునుగదా? కొబ్బరిచెట్టు- దూడగడ్డి సామ్యమైతేనేమి; సమాధానమనిపించుకొన్నదా? లేదా?

§. కాంగ్రెస్ అధ్యక్షుని బర్మాసంచారము:—

భారతకాంగ్రెస్ ప్రెసిడెంటు జవహరిలాలు బర్మాఖండమున పదమూడుదినములు సంచారముసలిపి డెబ్బదిమూడువేల రూపాయిలను కాంగ్రెస్ నిధికి కానుకగా బడసెను. వసూలైన ఈపెద్ద మొత్తము బర్మాదేశపు కాంగ్రెస్ అభిమానమునకు ఒకగురుతు.

§. ఫ్రెంచిఇండియాలోకూడ శారదాచట్టము:—

బ్రిటిష్ ఇండియాలోవలె ఫ్రెంచి ఇండియాలోకూడ శారదాచట్టము అమలులోనికి వచ్చినట్లే. ఇకమీదట ఫ్రెంచి ఇండియాకు చెందిన యానాము, పుదుచ్చేరి మున్నగు తావుల యందు వధువులవయస్సు 14 సంవత్సరములకు పైబడియు, వరులవయస్సు 18 సంవత్సరములకు పైబడియు నుండవలయును. ఈ సంస్కరణము గొనివచ్చుటలో ఫ్రెంచి అధికారులు ఎంతజాప్యము చేసినను ఇప్పటికైన దారికి వచ్చినందులకు మిక్కిలి సంతోషించుచున్నాము.

§. పత్రికలధరావతులు తిరిగి ఇచ్చివేయరాదా?

కొత్తమంత్రులు ఏర్పడినపిమ్మట బర్మాలో పత్రికలనుంచి లోగడ వసూలుచేసిన ధరావతు సొమ్ములను తిరిగి ఆయాపత్రికలకు ఇప్పించివేసినారు. భారతదేశమున వివిధరాష్ట్రములందు ఏర్పడిన కొత్తమంత్రులుకాని, నడుమంతరపు మంత్రులుకాని ఈమాత్రపు మంచి పనినైనను ఇచ్చట చేయుటకు ఇంతవఱకు తలపెట్టలేదు. ప్రజాహితదృష్టి మృగ్యమగు ఈ మంత్రు లిట్టిపనుల నేల తలపెట్టెదరు?

§, దేశోద్ధారకునకు సన్మానము : శిలావిగ్రహము:—

విశ్వదాత, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి సన్మానవిషయమై పలుదినములనుండి పలువురు పలువిధములుగా వ్రాయుచున్నారు. ఇటీవల ఒకరు శ్రీవారి శిలావిగ్రహప్రతిష్ఠాపన సముచితముగ నుండునని సూచించియున్నారు. శిలావిగ్రహప్రతిష్ఠాపనపూర్వకమగు సన్మానము అర్హముగను శాశ్వతముగను ఉండునని మా అభిప్రాయము. కొలది రోజులలో జరుగనున్న ఆంధ్రరాష్ట్రీయమహాసభలో ఈవిషయమై ఆంధ్రులు ఏదైన నిర్ణయము తప్పక జరిగించితీరెదరుగాక అని ఆశించుచున్నాము.

§. వావిళ్ళవారి సన్మానముమాట యేమైనది?:—

పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములను సుందరముగ ముద్రించి ఆంధ్రమహాజనులకు మహోపకారము చేయుచున్న వావిళ్ళవారి సన్మానించుటకు ఆనడుమ కొంత ప్రయత్నము సాగినది. కాని ఇపు డావిషయమై ఏమియు వినిపించుటలేదు. పూనియున్నాము కావున యథాశక్తిని సత్వరముగ వావిళ్ళవారిని సన్మానించుట ఆంధ్రులమగు మన విధియైయున్నది. సత్వరకార్యాచరణమునకు సమయుపకువముగాక!



# భాగ్యసాధము

రచయిత:

శ్రీగిర్రాజు రామారావు

భాగ్యము నైతికజీవనముపై ఆధారపడియున్నది. నీతినియమములు లేనివారి కదృష్టమెక్కువయట. అనగా మోసము, స్వార్థపరత్వము, దురాశ, కపటముగలవారు వృద్ధిపొందుదురట! మోసము లేనిదే వ్యాపారముసాగదని యనుట మన మనేకసారులు వినియున్నాము. ఈ నిర్ణయము కేవలము అర్థములేనిది. నైతికజీవనములోని కొరతను బయటపెట్టుచున్నది. జీవితతత్త్వమును సరిగా అర్థముచేసికొనకపోవుటవలన కల్గిన ప్రమాదమేయిది. జీవితమునకు స్వభావసిద్ధముగా కావలసినవి తెలిసికొనకపోవుటవలన సంభవించిన నిర్ణయమిది. అట్టివాని జీవితము బురదలో పునాదిలేకుండ ఇల్లుకట్టినట్లే అగును. నైతిక, అధ్యాత్మికములు రెండును ఒక్కటేకాని ప్రకృతిలో మనము చూచు వస్తువులలోను, చూడని వస్తువులలోను భేదముకనుపించును. మానవుడు ప్రకృతిలోని వస్తువులనుచూచి, వాని కనుగుణ్యముగా సంచరించును కాని దానిలోని మూలతత్త్వమును గ్రహింపడు. నైతికముగనే పోయి తుదకు పరాజయమొందును.

ఆధ్యాత్మిక ప్రవృత్తిస్వాభావికము. హృదయప్రపంచమున నియ్యది పుట్టియేయున్నది. మహర్షులు మొదలైనవారందరు చెప్పిన నీతులు దీని ననుసరించియే యున్నవి. మనకు కనుపించుచున్న ప్రపంచమంతయు మానసిక ప్రపంచము. కనుపించని దాని నీడ ప్రకృతియను అద్దములో ప్రతిబింబించుచున్నది. సున్నలో పై అర్థభాగమునకు క్రిందిభాగమునకు భేదములేదు కాని రెండు వేరువిధములుగా తలక్రిందులుగానున్నవి. బాహ్యప్రపంచము, సూక్ష్మప్రపంచము రెండును వేరుచేయబడిన అర్థచక్రములు. రెండును కలసినప్పుడు సున్నయగుచున్నవి. ప్రకృతియు, ఆత్మయు రెండును ఒక్కటే. రెంటికి విరోధమెన్నడునులేదు. ఆత్మతత్త్వమును గ్రహించుకొనలేక మానవుడు తనకుతానే బాహ్యచక్రములోనుండి వేరగుచు అవస్థలపాలగుచున్నాడు. ప్రతి పదార్థము దాని సత్యస్వరూపము, మార్పులు మొదలైనవి మనసుయొక్క స్వరూపము, మార్పునుబట్టియే యుండును.

ఏపదార్థమైన తీసికొనుడు. సరిగా తెలిసికొనగల్గినచో ఆవస్తువునకు ప్రకృతిలోగల యనుభవము నీమనస్సు పొందుచునేయున్నది. ఒకగింజ వేసితివి. అది చెట్టుఆయినది. పూవులుపూసి కాయలుకాసినది. కాయలు తిరిగి గింజలైనవి. అట్లే హృదయక్షేత్రమున నాలోచన అనుగింజపడినది. చెట్టువలె పెరిగి ఫలించినది. ప్రకృతి కనుగుణ్యముగా మంచిగనో చెడుగనో ఫలములు పుట్టినవి. ఆఫలములు మరల మరియొక మనోక్షేత్రమున వృద్ధిపొందుచున్నవి. గింజ పాతువాడే గురువు—ఆధ్యాత్మికకర్షకుడు—తనకు తానే అనగా తనగింజను తానే మరల తన క్షేత్రమున పాతుకొన్నవాడు తనహృదయమునకు తానే గురువు. సమయమును కనిపెట్టి గింజ పాతవలెను. తగిన సమయ మిచ్చినచో అది తప్పక జ్ఞానవృక్షమయి వివేకప్రసూనమును దాల్చును.

ఒక్కసారి మీ కిటికీలోనుండి వెలుపలికి చూడుడు దూరముగా ఒక చెట్టుమీద పక్షిగూడు కనుపించును. ఆగూడు క్రొత్తగా కట్టుకొన్నది. పడమటిగాలి విసరుచున్నను, చెట్టు ఊగుచున్నను గూడు క్రిందపడదు. పక్షులు సౌకర్యముగా దానిలోనుండి ఉయ్యాల లూగుచున్నవి. ఇందులకు కారణమేమి? ప్రకృతి కనుగుణ్యముగా నది గూడుకట్టుకొన్నది. అందువలన ఆగూడుకు బలమెక్కువ. గూడుకట్టుటకు పంగలు చూచుకొన్నది. గూడు గుండ్రముగనే కట్టినది. ఇందువలన బయటకలుగు ఒత్తిడి విస్తారముగా దానికుండదు. ఇది చాల చిన్నవిషయము. అయినను ప్రకృతిలోని సర్వశాస్త్రములు ముఖ్యముగా విజ్ఞాన గణితశాస్త్రము లిందు ఇమిడియున్నవి. కాబట్టి జీవితమును ప్రకృతి ధర్మానుసారము నిర్మించుకొన్నచో అయ్యది నిష్ఫలము కాదు. ప్రపంచములో తరచు కలుగు కష్టములకు లేక అవాంతరములకు లొంగదు. గుడిగాని, యిల్లుగాని పక్షిగూడుకంటె కష్టమైనది. ఇయ్యవి ప్రకృతిలో స్వభావసిద్ధముగా నిమిడియున్న గణితశాస్త్రప్రకారము కట్టబడినవే. దీనినిబట్టి మానవుడు ప్రాపంచికధర్మముల కెట్లు లొంగియున్నాడో తెలియుచున్నది. స్కేలు, కంపాసు, లెవెలు మొదలగు పనిముట్లకు లొంగి భవనమును లేపుచున్నాడు.

ఈ విషయములన్నియు చిన్నచిన్నవి కాని చిన్న విషయములైనను ఇవి సత్యములు, పూర్ణత్వమును పొందినవి- ఇంతకంటె వేరువిధములేని చిన్నవిషయము. ఎంతకాలము తెలిసికొని మానవుడిది గ్రహించినాడో తెలియదు. నేడు ఆశాస్త్రములకు లొంగి జీవించుచున్నాడు. మానవజీవితము ఇట్టి శాస్త్రముల ననుసరించియే నిర్మింపబడినది. కాని దేనివలన నిర్మింపబడ్డదో, యీ చిన్నవిషయమును గ్రహింపజాలకున్నారు. మానవుడు తానెట్లు నిర్మింపబడినాడో, తనజీవితసౌధము నిలువబెట్టుకొనుటకు మార్గము లేవియో తెలిసికొనకయే తనకు తెలియని యవస్థలపాలగుచున్నాడు. అదియే నైతిక పతనము.

అచేతనములోవలె మనస్సునందు, వస్తువులోవలె బుద్ధియందు ప్రకృతిలోవలె చేతలో నియమములకు పునాదివేయబడినది. తెలిసి లేక తెలియక దానిని విడచినను జీవితము వృధా అగును. ఈ నియమమును నిర్లక్ష్యముచేయుటచేతనే ప్రపంచమున నింత దుఃఖము సంప్రాప్తించియుండుట. అచేతనములలో గణితమున్నది. బుద్ధిలో, మనసులో నీతియున్నది. గణితము, నైతికము వ్యతిరేకములు కావు. ఏకాకారములోని రెండుభాగములు. గణితశాస్త్రనియమములోనున్నది ఆచారనీతి. నీతివిద్యలో నిమిడియున్నవే గణితశాస్త్రనియమములలోని నైజము. ఇవి హృదయగోళమున పనిచేయుచుండును. నైతికజీవితము లేనిదే మానవుని జీవితము రాణించదు. నైతికముగా నిర్మింపబడిన మానవజీవితము దృఢముగా నుండును. ఈ జీవన సౌధము కట్టుటకు చాలకాలము పట్టును. సౌధమునకు ఉపయోగించు రాళ్ళు సత్కర్మ. మానవుని యేవృత్తియైనను సత్కర్మకు దూరముగాలేదు. నీతినియమములకు కట్టుబడిన మరింతదృఢముగా నుండును. భాగ్యము దృఢముగా, చిరకాలముండుటకు నైతికనియమములు తూచా తప్పక పాటింపవలసి యుండును. అప్పుడే భాగ్యసౌధమును కట్టగలడు. నిశ్చలమైన సద్గుణము, నిష్కల్మష నైతిక నియమములు ఆసౌధమున స్తంభరూపమున నిలువబడి కాపాడును. శాశ్వతముగా అదృష్టమును పొందినవారిట్టి మహానుభావులే. శాశ్వతమనగా కొన్నివందల తరములవరకు నిలువబడు అదృష్టమును, భాగ్యమును పొందుదురు.

వ్యాపారము నిలువబెట్టుటనుగూర్చి మానవులు తలంచుచుందురు. ఇదికూడ ఒక భవనమును నిలువబెట్టుపోలికయే. నిలువబెట్టునదేదియైనను నైతికాధారమైయున్నది. భాగ్యము లేక అదృష్టము ఇంటికప్పువలె మానవుని కాపాడును. ఇట్టికప్పు స్తంభములపై ఆధారపడియుండును. స్తంభములు, గోడలు కట్టుటకు పునాదులుండవలెను. భాగ్యసౌధమునకే క్రింది

8 స్తంభములు అత్యవసరములు.

1. శక్తి, 2. పొదుపు, 3. శుద్ధి, 4. క్రమపద్ధతి, 5. సానుభూతి, 6. సహృదయత, 7. నిష్పక్షపాతము, 8. ఆత్మవిశ్వాసము.

ఈ నైతికనియమములపై కట్టబడిన భాగ్యసౌధమున కేయాటంకమును కలుగదు. వీనిలో నే స్తంభము బలహీనమైనను భవనము హీనస్థితిలో నుండును. అన్నియు సరియైన పునాదిపై నిలువబెట్టబడినచో మరింత దృఢముగా నిలువబడియుండును. ఈ నియమములు కల ఒకడు ఒకసంస్థకు అధికారిగానున్నాడని యనుకొనుడు. ఆసంస్థ అతనికి తెలియకుండగనే అభివృద్ధి చెందును. ఏనియమములచే నియ్యది దృఢమగుచున్నదో మనము తెలిసికొనజాలము. సామాన్యనైతిక నియమములు తెలిసికొననివాడు తనసంస్థను వృద్ధి చేయజాలడు. తుదకు నైతికజీవనమే యతనిని చెరపుచున్నదని తలంచును. కాని తననైతికనియమములింకను వృద్ధిపరచుకొన్నచో సంస్థ యింకను అభివృద్ధి చెందునని అతను తెలిసికొనజాలడు.

పైన వివరించిన ఎనిమిది నియమములు జీవితములోని ప్రతికార్యమునందును తోడ్పడును. భాగ్యసౌధమునకు క్రింద నియ్యవి స్తంభరూపమున నిలువబడియుండును. ఇవి ఏస్వరూపములో నున్నను సరే తగిన శక్తిగలవి అయ్యేయున్నవి. అప్పుడే మానవునకు జీవనసంగ్రామమున విజయము చేకూరును. ఇట్టి విజయమును సంపాదించిన మహానుభావులు చాల తక్కువ. సంపాదించినవారే మనకు గురువులు, మనకు మార్గదర్శకులు, సంఘసంస్కర్తలు, మానవ ప్రపంచములోని మహాత్ములు. నైతికనియమముల గూర్చి సంపూర్ణజ్ఞానము సంపాదించలేక భాగ్యసౌధమును కొంతవరకు కట్టుకొన్న మహానుభావులు కలరు. అట్టివారు ఏవోకొన్నింటిలో మాత్రము సంపూర్ణత్వమును బొందినవారితో సమానము. కానివారు తక్కిన నియమములలో గూడ సంపూర్ణత్వమును బొందుట కవకాశమున్నది.

మానవుని నైతికజీవనమునకు సరిహద్దు విజయరేఖ. కాబట్టి జయాపజయములు నైతికజీవనముపై ఆధారపడియుండును. భాగ్యసౌధము నైతిక స్తంభములపైననే నిలువబడియున్నది. స్తంభములబలమే సౌధబలము. లేనిచో కూలుట నిజము.

పైకి రాయి వేసిన క్రిందపడును. అట్లే ప్రతికార్యము మంచిదికాని చెడ్డదికాని తిరిగి మనవద్దకే వచ్చును. చెడుకార్యము ఎగిరి మనయింటిపైన నేపడి దానిని కూల్చును. సత్కార్యములు స్తంభములకు బలమెక్కించును. అంతియేకాదు. భవనమును సుందరముగా జేయును.

మానవులు, కుటుంబములు లేక మతములు నైతిక పతనము లేనంతకాలము అభివృద్ధియగుచునే యుండును. మానసికముగా, శారీరకముగా నీతినియమములకు కట్టుబడినవారే చిరకాలము నిలువబడును. అవినీతి శూన్యపదార్థము. దీనిలోనుండి ఏమియు వెలువడదు. ఇది ప్రకృతినే తిరస్కరించును. అవినీతి వినాశకారకము. వస్తునిర్మాణమునే తిరస్కరించును. అవినీతి ఆధ్యాత్మికశక్తుల వెలితి చేయును. ఈవిధముగా అవినీతి యవస్థపడి అదృశ్యమగును. అదృశ్యమగుచు దాని యనుభవమును కొంతవిడచిపోవును. వానిలోనుండి సత్యమును గ్రహించువాడు సూక్ష్మగ్రాహి. అతనిదే ధర్మశాస్త్రము. అవినీతికి వ్యతిరేకము నీతి. దీనిలో ప్రకృతిధర్మము ఇమిడియున్నది. అట్టి నైతికోన్నతియే మానవుని, వంశములను నిలువబెట్టును—నిలువబెట్టెను.

నీతి నిశ్చలమైనది. అపజయమెన్నడు దీనికి కలుగదు. విజయము సత్యము. యుద్ధము లేనిదే విజయముండదు. జీవనోపాధియే యుద్ధము. ఈయుద్ధములో అతడు పరీక్షింపబడును. ప్రపంచములో దేనినైనను భరింపగలశక్తిగలది ఇనుము. ఇది ఒక ఆకారమును బొందుటకెన్నిసారులో కమ్మరిచేతిలో పరీక్షింపబడుచున్నది. ఇటుకకూడ అంతియే. కాబట్టి శాశ్వతవిజయమును పొందినవారెన్నియో కష్టములకు, పరీక్షలకు

లోనై యుండును. ప్రతిమానవునకును ఈపరీక్ష గలదు. అనేకవిధములగు విషయవాంఛలలోబడి బయటపడు వాడు భాగ్యసౌధమును కట్టుకొనుచున్నాడు. నైతిక పతనమును బొందువాడు ఊరుపేరులేకపోవుచున్నాడు.

నీతినియమములు లేనివాని కెప్పుడును అపాయమే. అతనికికూడ భాగ్యమబ్బుచున్నట్లనుపించును. కాని పతనము నిశ్చయము. జేబునిండుగా బంగారము నింపుచుండును కాని జేబులో చిల్లియున్నది కనిపెట్టడు. నైతికోన్నతికై పాటుపడనివాడు ప్రథమ పరీక్షలోనే పడిపోవును. అట్టివాడు ఎండకు పగిలిన యిటికవలె త్రోసివేయబడును. అతను ఇటుక కాదు కావున మరల ప్రయత్నించుట కవకాశమున్నది.

నైతికశక్తియే విజయమునకు జీవము. ఇదియే భాగ్యోన్నతిలోని యంశము. విజయము లనేకవిధములు. మానవుడు తప్పక ఒకదానిలోనయినను పరాజయమును బొందును కాని మరియొకదానిలో అఖండ విజయమును బొందుననుటకు సందేహము లేదు. విద్వాంసుడు, కళాప్రపూర్ణుడు లేక ఆధ్యాత్మికతత్త్వవేత్త ధనసంపాదనమునకు వెడలుననుకొండు. విద్వత్తునభివృద్ధిచేసికొని యాదర్శపురుషుడగుటయా లేక ధనవంతుడగుటా? రెంటిలోనేదియో ఒకటిమాత్రమే వానికి సిద్ధించును. షేక్స్పియరు వాఙ్మయమునుగాని, బుద్ధుని యాత్మతత్త్వమునుగాని కోట్లుఖరీదిచ్చి బేరముచేయగలవారు కలరు. వారు చౌకబేరము చేసితిమనుకొందురు కాని ఆధ్యాత్మికతత్త్వములో ధనమును బోల్పలేము. ఈరెంటికిని సంబంధములేదు. ఆతత్త్వమునుగూర్చి యిప్పుడు వ్రాయుట నాపనికాదు. ప్రతిమానవునకును సుఖము, సంతోషము, క్షేమము కలుగు పద్ధతులను మాత్రమే వ్రాయుదును. అవికలిగినవాడే అతడు భాగ్యవంతుడు. ఈభాగ్యము ధనముతోకూడియున్నదే. భాగ్యమున్నవాని మనసు శాంతముగాకూడ నుండవలెను. శాంతములేనిదే సౌఖ్యములేదు. భాగ్యము, సౌఖ్యము ఇయ్యవి మానవున కెట్లబ్బునో పరిశీలింతము.

## శక్తి

ప్రారంభించిన కార్యమును తుదివరకు కొనసాగించుబలమే శక్తి. బొగ్గుకు నిప్పుఅంటించిన మండును. దానిపై నీరుచల్లిన ఆవిరియై నిప్పు ఎగిరిపోవును. అదేవిధముగ అగ్నియే శక్తి. మందమతిని గూడ లేవదీయగల బలము దీనికున్నది.

శక్తిఅనునది నైతికనియమము. దీనికి వ్యతిరేకము సోమరితనము. శక్తి ఒక సద్గుణము. దీని నభివృద్ధి చేయవచ్చును. సోమరికూడ సాధనవలన బలవంతుడగును. సోమరి చేతకాదను సమయములో శక్తిమంతుడదేపనిని చేయుచున్నాడు. సోమరి నిద్ర లేవకపూర్వమే చురుకుగలవాడు కొంతపనిని పూర్తి చేయును. సోమరి అనుకూలసమయమునకు వేచియే యుండును. శక్తిమంతుడు నిశ్చలబుద్ధితో బయల్వెడలి అనుకూలసమయమును గ్రహించియేయుండును.

శక్తి ఆదిశక్తులలో ఒకటి. ప్రతికార్యములోను ఇదియే మొదటిమెట్టు. సృష్టియంతయు శక్తిలో నుండియే బయల్వెడలెను. మానవునియందున్న శక్తియే జీవము. ఆశక్తిని వినియోగింపనివానికి జీవములేదు, ప్రపంచమేలేదు. మానవుని శరీరములోని ఇంద్రియములు పనిచేయనప్పుడు అతను మరణించెనని చెప్పుదుము. సోమరి ఇంతకంటె ఘనుడుకాడు. మనుష్యుడు శారీరకముగా మానసికముగా పనిచేయుటకే నిర్మింపబడెను. నిద్రపోవుటకుకాదు. శరీరములోని ప్రతి అవయవముకూడ పనిచేయుటకు తగినట్లుగనే నిర్మింపబడినవి.

సోమరికి సుఖములేదు. స్వతంత్రములేదు. శాంతములేదు. భాగ్యమంతకంటెలేదు. సోమరి తనపనిలో చాల కష్టపడునని శాస్త్రము. ఎందువలననగా అతని పనిలో క్రమవిధానముండదు. మానసికశక్తి, బుద్ధిచాతుర్యము ఉండదు. తుదకు సోమరి కఠినావస్థల పాలగును.

ప్రారంభించిన కార్యమును విడువనివాడు ధీరుడు. ఆకార్యఫలము మంచిదైననుసరే చెడుఅయిననుసరే,

చెడుకార్యములకు ధీరత్వమును బొందువానికి తనకు తానే ముప్పు తెచ్చిపెట్టుకొనును. గట్టిగా గోడను గ్రుద్దినచో చేయివిరుగును. సత్కార్యములకు ధీరత్వమును బొందినచో, కార్యఫలమువలన నతనికి సుఖము చేకూరును.

శక్తిని చెడుగా ఉపయోగించుటకంటె శక్తి లేకుండుటయే మంచిది. చెడుగా ఉపయోగించుకొనువానికొక లాభమున్నది. అతని దుర్మార్గవర్తనములో, అన్యాయ స్వార్థపరత్వములో కష్టములపాలై తుదకు తనతప్పు గ్రహించి పశ్చాత్తాపపడి సన్మార్గుడగును. అప్పటినుండియు అతడు మనోచక్షువులను తెరచును. అతనిశక్తి ప్రవహించుటకు క్రొత్త కాలువలేర్పరుచుకొనును. ఇదివరకు యీర్ష్యలో ఇమిడియున్న దృఢత్వము మంచిగామారును. "అమితపాపము లొనర్చువాడు గొప్పయోగికాగలడు." అని శాస్త్రము.

మనోబలము దృఢమైనది. శక్తిమంతమైనది. దృఢత్వములేనిదే సద్గుణ మబ్బదు. పాపముచేయనంతమాత్రమున సద్గుణము కానేరదు. మంచిచేయుటయే సద్గుణము. ప్రయత్నించి తగినబలములేక తలచినకార్యమును విడచువారుకలరు. వారు అపాయమును కూర్చువారుకారు. వారితరులకు కీడుచేయరు. సాధారణముగా మంచివారే తమ పనులలో అపజయమును బొందుచుందురు. మంచివారు చెడు చేయగలశక్తిమంతులైనను మంచికే వారికాలము వినియోగింతురు. దృఢసంకల్పశక్తిలేనిదే నైతికశక్తి యేర్పడదు. ఏర్పడియున్నమంచి కొంచెము అదృశ్యమైపోవును. శక్తిలేకుండ యంత్రము ఆగిపోవునట్లు మానవయంత్రము ఆగిపోవును.

బాహ్యప్రపంచములోగాని, సూక్ష్మమైన జిజ్ఞాసలోగాని లేక తదితర మేవిధమైన కర్మలోగాని దృఢసంకల్పశక్తియే మూలకారణము. యుద్ధవీరులకుగాని, ఇంజనీయరులకుగాని, వ్యాపారులకుగాని, ఎవ్వరికైనను కావలసిన దిదియేశక్తి.

ఎల్లప్పుడును మెలకువగా నుండవలెనని పెద్దల యుపదేశము. ఇది యోగిమొదలు వ్యాపారివరకు ఇచ్చెడి సలహా. మెలకువలో జాగ్రత్త చురుకుతన మున్నది. ఇట్టి గుణములుకలవానికి స్వతంత్ర మెక్కువ. స్వతంత్రమే మానవునిపరమావధి. అధికశక్తిని సంపాదించుటకు తనలోగల శక్తినంతయు వినియోగింపవలెను. శక్తిని వినియోగించుటలో మానవుడు నిగ్రహముకలవాడైయుండవలెను. 'శక్తినిగ్రహము'అనునది ప్రకృతిలో నుండి సంగ్రహింపబడినదే. శక్తి ప్రకృతినుండి అనవసరముగా ఖర్చుకాదు. కార్యతత్పరతలో శక్తిని వినియోగింపవచ్చును అనవసర సంభాషణ, తొందర ఇవి శక్తిని తగ్గింపజేయును. అమితమగు తొందర, కార్యమున జంకు మంచివి కావు. అమిత హడావిడిలో కార్యము శూన్యము. పనిచేయుచున్న ఆవిరిశబ్దము మనకు వినబడదు. ఆవిరి బయటకు పోవునప్పుడే మనకు వినబడును. బాగుగా త్రొక్కినమందే తుపాకీగుండును వేగముగా పంపగలదు. కాబట్టి శక్తిని త్రొక్కియుంచిన వారికి శక్తి అధికముకాగలదు.

లోతు ఎక్కువగానున్న నీరు నిలకడగా నుండును. శాంతస్వభావ మెక్కుడగలచో అచ్చట శక్తియెక్కువగా నుండును. శాంతము శక్తి, క్రమపద్ధతి, అనుభవములను సూచించును. శాంతము కలవాడు తనపనియందు దృఢత్వమును బొందియుండును. అతను మితముగా మాట్లాడును. అతని యాలోచనలు చక్కనిపద్ధతిలోనుండును. అతను దూరదృష్టి గలవాడైయుండును. చూచునంతవరకు బాట సరిగా చేసికొనును. విరోధినికూడ మిత్రునిగా త్రిప్పగలడు. అతనిచేతనే సేవచేయించుకొనగలడు. అతనికి విషాదముండదు. గాబరాఉండదు. అతనికంటె మనము ముందంజవేయుచున్నా మనుకొందుముకాని ఒక్కనిమిషములో మనలను మించిపోగలడు. అతనిని ఏవిధముగానయినను దూషింపుముకాని అతని చిన్న సమాధానమువలన నీకోపమంతయు మాయముకాగలదు. అతనిని తిట్టుముకాని అతని దీనమైనచూపు నిన్ను మరల్పగలదు. అతడు జీవితములోని యన్ని అవస్థల నెదుర్కొనునట్లే మానవులందరిని ఎదుర్కొన

గలడు.

శాంతము, సహనము ఇత్యాది శక్తినిగ్రహము వలన కల్గినవే. ఈశక్తికి వెనకనే ధీశక్తియున్నది. ఉద్రేకములో కొందరలో నత్యాది మాయమగును. మాయమైనట్లాతనికి తెలియదు. కదలకుండ పడియున్న ప్రక్కయింటివాని ఉద్రేకమునుగూర్చి ఆశ్చర్యపడును.

కాబట్టి శక్తిగల మానవునకు భాగ్యసౌధమును గట్టుకొనుట సులభము. శక్తిలేనిచో నిండు లేదు. నిండులేనిచో ఆత్మగౌరవము, స్వాతంత్ర్యముండదు. ఈయుద్రేకశక్తి నేటి యనేకమందిలో కనుపించును. చెడుఅలవాటుల కలవడి ఇరుగుపొరుగువారితో నిచ్చకములాడుచు ఉద్యోగమునకు యత్నించువానికంటె కష్టములను లోనయి ప్రయత్నించువానికి త్వరలో ఉద్యోగముదొరకును. పనిలో ఆసక్తిగలవానికి పని దొరకి తీరును. లేదా ఆతనే పనిని కల్పించుకొనును.

సోమరికి ఉద్యోగమన్న ప్రాణభయము. పని తప్పించుకొనుటనుగూర్చియే ఆత నాలోచించుచుండును. బీదలను భాగ్యవంతుల కొప్పజెప్పు సామ్యవాదులుకూడ సోమరిని తరిమివైచి నిరుద్యోగసైన్యములో జేర్తురు.

శక్తి ఒకేవస్తువుకాదు. ఇది మరికొన్ని వస్తువులతో కూడుకొని యున్నది. అయ్యవి :

1. క్రమబద్ధమైన చురుకు, 2. ధీశక్తి, 3. పరిశ్రమ, 4. తత్పరత.

క్రమబద్ధుడై పనిచేయువానియందు నమ్మిక మెక్కువకల్గును. వారికి నియమించిన పనియందు ప్రమాదముండదని ధైర్యమువహింపవచ్చును. క్రమబద్ధుడగు అధికారివలన కార్యకర్తలకు సుఖమెక్కువ. రోజారోజు పనిని జరుపువాడు కాలమునకు వెనుకబడిపోయి ఇతరులకు ఆటంకము కలిగించుచుండును.

రెండవది ధీశక్తి, మంచిచెడ్డలను నిర్ణయింపగల పరిశోధనశక్తికలదే ఇది. తెలివికి, విజయమునకు, స్వతంత్రమునకు మిక్కిలి తోడ్పడునదిది. ధీశక్తిలేనివాడు మూర్ఖుడు, మూర్ఖునకు భాగ్యమబ్బదు. మూర్ఖుని బుర్రలో అనేకవిధములగు ఆలోచనలు తిరిగితిరిగిపోవుచుండును. ఏదియును నిర్ణయింపజాలడు. ప్రపంచములోని ప్రతివిషయమునకు మెదడులోని ద్వారమును తెరచి కూర్చుండును. ఇతరులుచేయకూడనిదేదియో తెలిసికొనవలెనన్న ఇతనినిచూచి నేర్చికొనవచ్చును. మూర్ఖునకు సంఘమర్యాద కలుగదు.

జీవితములో చిన్నచిన్న విషయములను తెలిసికొనక పోవుటయే మానవుని మెదడు గట్టిదికాదనుటకు నిదర్శనము. ఆలోచనలేకపోవుటయే మెదడులేదని చెప్పుదురు. తనస్వంతవిషయములో ఈమూర్ఖతకల్గియున్న నత్యాది క్రమముగా సంఘములోనికి ప్రాకగలదు. అతనితో సంబంధమున్న ప్రతివానికిని ఇతని మూర్ఖత అబ్బుట కవకాశమున్నది. దీనివలన కొంతకాలమునకు తనభాగ్యమునకు,సుఖజీవనమునకు పురుగుముట్టినట్లగును.

కాబట్టి ప్రపంచమునకు మన మేవిధముగా నిత్తుమో ఆదేవిధముగా మనకు దొరకునని తెలియవలయును. మంచికిమంచి. చెడుకుచెడు. దుర్గుణమునకు చెడుపేరు- అపజయము- మంచిగుణమునకు అధికశక్తి- విజయము. మనపనికి జగమంతయు చేయూత నొసంగును. దుర్గుణముకలవాడు తప్పి ఇతరులను దూషించును. తనతప్పు తనకు తెలియదుకాని బుద్ధిమంతుడు తన్నుతా దిద్దికొనగలడు.

మూడువది పరిశ్రమ. పరిశ్రమవలన సుఖముగలదు. ధనలాభముకలదు. కాని వారందరు అధికభాగ్యవంతులుగాలేదు. కాని తమకున్నంతలో అమితానందమును బొందుదురు కాబట్టి వారు నిజమైన భాగ్యవంతులకంటె భాగ్యవంతులే. చురుకుగాపని చేయువారికి తమ కష్టములుగూర్చి చింతిల్లుటకు సమయముండదు. లోహము అరిగినకొలది కాంతివచ్చునట్లు పరిశ్రమలో నలిగినకొలది మానవునకు కీర్తిహెచ్చును. సంతోషము హెచ్చును. ప్రకృతిలో గ్రహింపవలసిన దెంతజ్ఞానముకలదు! ప్రపంచమునకు తానుచేయవల

సినపని యెంతకలదు? మానవునిజీవిత మెంతయున్నది? ఇట్టిస్థితిలో కాలముగడుపుట అనుపదమున కర్థములేదు. అనుదినము హృదయములో, బుద్ధిలో మెదడులో నిమిడ్చవలసిన విషయము లనేకములు. అయ్యవి గ్రహించుకొని తిరుగువానికి కాలము నిజముగా చాలదు.

పరిశ్రమవలన ఆరోగ్యమబ్బును. పనిచేయువారు ఆహారము నిద్రను గూర్చినియమములు తనకు తెలియకుండగనే పాటింతురు. వారు చాల ఆనందముగానుందురు.

నాల్గవవిషయము తత్పరత : మానవుడు చిరంజీవియైయుండుటకు తత్పరతయే ముఖ్యమని యొక మహానుభావుడు పల్కియున్నాడు. 'నేను మరణించుటకు నాకు సమయము లేదని' మాలవ్యా పల్కియున్నాడు. కార్యతత్పరతలో నతనికి మరణభయము లేదు అతనిహృదయము పనిలో ఇమిడియుండును. అతను చేయదగినపనికి ఎంతతక్కువ చేసినను అతనికి సంతోషముండదు. అట్టిమనుష్యులు తమతమ పనులలో, తమసద్గుణములలో ఆదర్శప్రాయులు గానుందురు.

ఇప్పటికి భాగ్యసౌధమునకు ప్రథమ స్తంభమును కట్టితిమి.

(కాపీరైటు.)



# కట్నాల కాంక్ష

రచయిత్రి

శ్రీమతి బులుసు ప్రకాశమ్మదేవి

౧

ఉదయం ఎనిమిదిగంటలవేళ.

సీతమ్మగారు కాలవలో బిందె తోముకుని నీళ్లుముంచుకుంటోంది. ఈవేళ ఆమెను చూస్తే సాక్షాత్తు ఆ శ్రీమహాలక్ష్మిలాగే కనపడుతోంది. చూచినవాళ్ళందరు, అల్లాగే అనుకుంటున్నారుకూడాను. ఈకాలపు నాగరికతలు ఆమెకుగిట్టవు. వంటినిండా వస్తువులు, కళ్ళనిండా కాటిక, నుదుట పావలాకాసంత తోపుకుంకుంబొట్టు, లక్కరంగు బరంపురం పట్టుచీర ఆమెను ఓమాటుచూస్తేచాలు, మళ్ళీమళ్ళీ చూడాలని బుద్ధిపుడుతుంది. ఇంకా ఇద్దరుముగ్గురు వూళ్లో స్త్రీలు ఇప్పుడిప్పుడే చేతులో పసుపు, బిందెలో బట్టలు పెట్టుకుని మెల్లిమెల్లిగా చేరుతున్నారు. 'ఇదిగో సీతమ్మగారు! అప్పుడే నీళ్ళోసుకోవడమైపోయినట్టుందే. ఈవేళ పొద్దున్నే పట్టుచీర కట్టుకున్నారు. ఏదేనా నోమాయేమిటి?' అంది ఒకామె.

'లేదమ్మా! ఈవేళ మాఅబ్బాయికి తాంబూలాలివ్వడానికి వచ్చారు. కాకినాడ సంబంధం; అనుకోకుండా కుదిరింది. అంచేత మీకందరికీ చెప్పడానికి వ్యవధిలేక పోయింది. అవునుగాని, ఇదిగో అనక చెప్పలేదనుకోనేవు. మధ్యాహ్నం ఓమాటురావేం. నీ యత్తకి వాళ్ళకి కూడాచెప్పు. తొందరగా వెళ్లాలి. వచ్చినవారు అబ్బాయిమామగారి భావమరిదిగారేట. రెండోఆయన వారిపురోహితుడు కామోసు. ఓమూల తలంట్లవాలి. అరిసెలొండాలి. ఏటొచ్చీ ఒఖత్తిని. దబ్బున రావేం, అమ్మా!' అంది బిందెఎత్తుకుంటూను.

'ఓహో, ఇంకాచెప్పరేం, పిన్నిగారూ. కట్నాలేపాటి. వియ్యపురాలి కేమాత్రం.' అంటే 'దేవుడిదయవల్ల అన్ని బాగానే కుదిరాయి, అమ్మాయీ! అనక స్థిమితంగా చెపతాను' అంటూ బుజాన్ని బిందెపెట్టుకుని తొందరగా వెళ్ళిపోయింది.

౨

వెంకటశాస్త్రిది అమలాపురం కాపురస్థలం. అది తూర్పుగోదావరిజిల్లాలో ఒకముఖ్య గ్రామం. అమలాపురంఅంటే కోనసీమే కళ్లకు కట్టినట్టుంటుంది. కోనసీమవారందరిచేత అది పట్నంగానే వ్యవహరింపబడుతుంది. చాలామంది కోనసీమవారి పట్నపుఅనుభవాలు అమలాపురపువే. పెండ్లికి కావలసినబట్టలు, ఇంటికి కావలసినవస్తువులు ప్రతీదానికి అమలాపురమే వారిపెద్దదిక్కు. మునసబుకోర్టు, ఆసుపత్రి, హైస్కూలు, సినిమాహాలు- మొత్తానికి పట్నపులక్షణాలన్నీ దానికున్నాయి.

స్వచ్ఛమైన వెలనాటి వైదికకుటుంబాలు ఇక్కడచాలావున్నాయి. బ్రాహ్మణీకం ఇక్కడఇంకా సజీవంగాఉందని చెప్పవచ్చు. హాయి

గా పంటలు పండుతూవుంటే యేచీకుచింతా లేకుండా కాలిమీదకాలువేసుకుని రోజులు వెళ్లబుచ్చేవారు ఇక్కడ చాలామంది వున్నారు.

ఆలాంటిసంపన్నగృహస్థులలో వెంకటశాస్త్రిఒక్కడు. అతనిభార్య సీతమ్మ.చాలాదొడ్డ యిల్లాలు. అమాయికురాలనికూడా చెప్ప వచ్చు. భర్త యేదిచెబితే అది అవునేమో అనుకుంటుంది. సంతానం ఆరుగురిలోను మొదటి అయిదుగురు వరుసగా ఆడుపిల్లలే. ఆరవవాడు రామారావు. ఆడపిల్లలతోవిసిగి సమస్తనోములునోచి ఆఖరికి సుందరకాండ పారాయణచేయగానే పుట్టడంచేత రామారావనిపేరుపెట్టుకున్నారు. 'కన్యాదానఫలం' అంటే మొదట వెంకటశాస్త్రిగారినే చెప్పాలి.చిన్నంబంగారమేనా పెట్టమనకుండా ఈమాజో డూచూసి కాళ్లుకడిగి కన్యాదానాలుచేసే డాయన. అల్లుళ్లంతా మంచిస్థితిలోవున్నారు. ముదిముప్పునపుట్టిన ఒక్కమొగబిడ్డని ఎంతెంతవాణ్ణోచెయ్యాలని వెంకటశాస్త్రిఆశ.

'చాపచిరిగినా చదరంత' అన్నట్టు ఆడపిల్లలపెళ్లిళ్లమూలాన్ని పోయినంతపోగా ఇంకా నాలుగైదువందలువచ్చేఆస్తి శాస్త్రిగారికి వుంది. ఆడపిల్లలసమ్మంధములు కుదిర్చిన అనుభవాన్నిబట్టి కొడుకుపెళ్లివిషయమై చాలా మధురమైనతలంపులు తలుచుకుంటూఉండే వాడు వెంకటశాస్త్రి. మూడవపిల్లపెళ్లికుదిర్చేటప్పుడు సెంటుభూమేనాలేని భలానివారి అబ్బాయికి 'పదిహేనువందలు ఇచ్చేటట్లయితే ఏమోఆలోచిస్తాము' అన్నారు వారు.

'ఆలాంటప్పుడు నాకు ఎలాచూసినా నాలుగువందలురావడానికి చావులేదు. ఒక్కమూడేళ్లు కళ్లుమూసుకుంటే మనవాడూ యెఫ్‌యేలోకివస్తాడు.' ఈతలంపులతో ఊహాకందినపెద్దవారి పిల్లలందరిమీదికీ అతని ఆలోచన పోయేది. 'మొన్న ఫలానివారు మీఅబ్బాయి ఏమిచదువుతున్నాడని అడిగారు, బహుశా వారి అమ్మాయినిఇద్దామన్న ఆలోచనతోటే అయివుంటుంది. వారు ఇదివరకు అల్లుళ్లందరికీ పెద్దకట్నాలే ఇచ్చారు. కాని వాళ్లపిల్లలు వట్టినలుపు, ఇవే అతనిఆలోచనలు.

3

మధ్యాహ్నం మూడుగంట లవుతుంది. వెంకటశాస్త్రిగారిసావిడి కలకల్లాడుతూంది. గ్రామములో పెద్దమనుష్యులు ఒక్కొక్కరేవచ్చి కూచుంటున్నారు. కొందరు తెల్లటి కండువాలు మడతవిప్పకుండానే చేతిమీదవేసుకున్నారు. ఓభుజాన్నిశాలువా ఓభుజాన్ని అంగాస్త్రంతో పొడుంకాయలు సవరించుకుంటా కొందరు. మధ్యని ఓచాపమీద పన్నీరుబుడ్డి గంధపుగిన్ని తమలపాకులు అరిటిపళ్లు పెట్టారు. 'భావగారూ! వర్షం ఇంకావుందంటారా' అంటే 'ఇక ఉపక్రమిత్తామా' అంటూ ఓహరితో ఒహరు సంప్రతిస్తున్నారు. వెంకటశాస్త్రిగారి ముఖంలో ఈవేళ లాక్యం తాండవమాడిపోతోంది. సీతమ్మగారు చాలాసందడిగా అటూఇటూతిరుగుతూ ఎవరికేంకావాలో అడగడమేతడువుగా అందించుతోంది. మధ్యమధ్యవచ్చినవారితో'ఏదో మీఅందరి ఆశీర్వచనంవల్ల మాప్రాణాలురెండూ బావుండగా శాస్త్రనలుసు ఇంట్లో బయలుదేరితే మాకంతేచాలు, వియ్యపరాలిపుట్టింటివారు చాలాఆపీతాగ్నులూ, సాంప్రదాయం మంచిదీట'అంటూ కాబోయేకోడల్ని, వియ్యాలవార్ని తలుచుకుని పొంగిపోతోంది.

'శాస్త్రిలుగారూ! అబ్బాయిగారిని ఈలా ఈపీటమీదికి రమ్మనమనండీ' అన్నాడు ఓఅవధాన్లు. రామారావుకి ని

జానికి పదిహేనోయేడు. సీతమ్మగారిని అడిగితేమాత్రం 'పదిహేను మొన్ననే కాదండీ వెళ్లేయి' అంటుంది. మీసకట్టు ఆట్టేకనపడ్డంలేదు. పచ్చగా గుమ్మడిపండులా వుంటాడు. ముఖంలో అతిగారాబపు లక్షణాలు తొణుకుతూవుంటాయి. ప్రస్తుతంఫోర్తుఫారం చదువుతూవున్నాడు. పెళ్లంటేఅతడికి చాలాసరదా. పట్టంచుపంచెలు చాలావస్తాయని, ఏదికావలిస్తే అదిమామగారిని దర్జాగా అడగొచ్చునని, మామగారనే వొకమనిషిమీద ఇష్టంవచ్చినంత అధికారం చలాయించ వచ్చునని ఈలాంటివే అతని ఆలోచనలు.

వాళ్లమ్మ 'పిల్ల పచ్చగా దబ్బపండులావుంటుందట' అని అందరితోచెబుతూవుండడం చేత ఓమాటు ఆపిల్లనిచూస్తే బాగుండునని కూడావుంది. 'జీలకర్ర బెల్లంపెట్టి తెరతీసేటప్పుడేగాని యీలోపున వధూవరులు చూసుకోడం శాస్త్రసమ్మతంకా'దన్నాడు వెంక శాస్త్రి. పెళ్లికొడుకుకుతగినటీవితో రామారావు పీటమీదికి వచ్చి కూర్చున్నాడు. అవధాన్లవారు ఒకటి రెండుపనసలు చదివేరు. సీతమ్మగారు తలుపువారనిల్చొని వళ్లంతాకళ్లతో ఈవైభవంచూస్తోంది. ఇంతలో ఆడపెళ్లివారివేపు వచ్చినపెద్దమనిషి లేచి మెళ్లో కండువా సర్దుకొని కొత్తపంచలచాపు అదివరకేవుత్తరించివుంచినది రామారావుమెళ్లో వేసి తాంబూలం చేతికి యివ్వబోతూంటే 'ఆగండి' అన్నాడు వెంకటశాస్త్రి. ఏమన్నఅర్థంగా తలతిప్పిచూచేడు ఆయన. 'వారికీ మనకీ జరిగిన మాటలేవో యేపద్ధతిని తథాస్తు అనుకుంటున్నామో అవన్నీ ఓమాటుఅని తాంబూలంయివ్వడంయుక్తం. స్తిమితంగాలాంఛనప్రకారమే నడుత్తాం. తొందరేముంది' అనిపక్కాయనవేపుతిరిగిఅన్నాడు వెంకటశాస్త్రి.

'అంతకన్నానా! నేనూ ఇదిగో మనవి చెయ్యబోతూన్నా. రెండువేల రూపాయిల కట్నము, అయిదువందలు లాంఛనములు, ఇవ్వమని అభిప్రాయంకనబరచేరు, అన్నగారు. ఎలాచూసినా బాలతొడుగుగాక పిల్లవంటినీ పదిహేనువందలకు దగ్గరగా పెద్దవస్తువులున్నాయి. అందుచేత వెయ్యిన్నూటపదహార్లు కట్నము లాంఛనాలు యిచ్చేటట్లుగా నిర్ణయపరచారు మాబావగారు. ఆలా జరిగించేటందుకు ఏమీ అభ్యంతరంలేదు.' అన్నాడు ఆపెద్దమనిషి. వెంకటశాస్త్రి ఇహ అక్కడలేడు. ఎటువెళ్లేడో! వచ్చిన గ్రామస్తులు మొహామొహాలు చూసుగుంటున్నారు. వారిలోంచి పెద్దలు యిద్దరుముగ్గురు లేచి ఆడపిల్ల వేపువారితోసహా పెరట్లోకెళ్లారు. రామారావు కూచోవాలో లేచివెళ్ళిపోవాలో తెలియక అందరిమొహాలూచూస్తూ వున్నాడు. మొగుడుతెచ్చిన పేచీకి సీతమ్మగారి వొంటిమీద జెర్రిలు పాకడం మొదలెట్టాయి.

'అన్నగారూ! తమరలాదయచెయ్యాలి' అంటూ తనవద్దకివచ్చినవారితో 'ఏమిరావడమండీ, శుభమస్తులోనే ఇంత పేచీకి సిద్ధపడ్డ మనుష్యులతో బాంధవ్యమేమిటండీ. వారి పిల్లకి వారు పదిహేనువందలు పెట్టుకోనీ ఏమిటిటగానీ అనుకున్నప్రకారం నడవక్కరలేదూ. ఇక మీరు లక్ష చెప్పండి. నామనస్సు తిరగదు. తమరు దయచేయవచ్చు' అన్నాడు వెంకటశాస్త్రి. 'మనవిజేస్తున్నా. పోనీ తమ శెలవుప్రకారమే' అంటూ ఇంకా ఏదో చెప్పబోతూన్న పెద్దమనిషిమాట చెవినిబెట్టకుండా 'ఇప్పుడేమన్నా ఇహవినను' అంటూ అక్కడవుంటేనే జవాబుచెప్పవలసివస్తుందని ఇంట్లోంచికూడా వెళ్ళిపోయేడు.

సీతమ్మగారికి ఇహ ఉండబట్టలేదు. ఆమె కూడా పెరట్లోకివచ్చి అక్కడివారితో 'అన్నగారూ! శాంతించండి. నామాటకాస్తవినండి, మొదటినుంచీ ఆయనది ఇదేతీరు, నేబతికుండగా ఆయన పిల్లాడిపెళ్ళి జరగనియ్యరు, నాముచ్చట తీరనియ్యరు, ఈకోపధారిమనిషితో యిదేమచ్చుని ముప్పైఏళ్లై వేగుతున్నాను. వెధవడబ్బు, ఓరెండొందలు ఎక్కైతే నేమిటి. మీరుకూడా తొందరబడకండి' అంది. 'ఏమిటండీ! అక్కగారూ! పిల్లవంటిని పెద్ద వస్తువులున్నాయి, మీరేనా పెట్టేవే గనక అవే మీవనుకుందాం. అని అనుకున్నాంగాని ఇష్టంలేకపోతే పోనీ డబ్బేకుమ్మరిద్దుం. ఇంతకీ యీ అభిప్రాయం మేము మొదటే తెలియబరచేంకూడాను. లేకపోతే మేమీవేళ యీలావస్తామా. పోనీ ఏలాగైనాసరే. కార్యసానుకూలం మనక్కావలసింది. అంటే ఆయన యింట్లోనే లేరాయెను. మేము మళ్ళీ వస్తాములెండి. పాపము మీరు బహు అమాయకులు' అంటూ వెళ్ళిపోయేరు.

౪

రామారావు స్కూలుఫైనలు ప్యాసయినాడు. వెంకటశాస్త్రి రాజమండ్రీకి కాపురం మార్చి కొడుకుని యింటరులో ప్రవేశపెట్టేడు. రామారావుకూడా మునపటికంటే పెద్దవాడవడంచేతనూ, కోనసీమగాలి బాగా పట్టడంచేతనూ తండ్రిమాటలలో వుండే సబబు అతనికి బాగా నచ్చింది. తనకేం వక్కడు. పంచుకునేవాళ్లెవరూ లేరు—పైగా చదువు—తొందరేంవచ్చింది—ఆ బి. యే. కాస్తా అయిందనిపిస్తే సరి. హైకోర్టు జడ్జీలు కూతుళ్ళని కాళ్ళమీద పడవేస్తారు. ఏమీ ఆధారం లేని శర్మగాడు చదువుపూర్తి అయేదాకా ఊరుకునేసరికి డిప్టీకలెక్టరు పిలిచి పిల్లనిచ్చాడు. పైగా తనది మంచిఆస్తి' అనుకుంటూ చదువుకుందామని యీజీఛేర్లో కూర్చుంటాడేగాని కళ్లు పంక్తులవేపు చూస్తూవుండగానే ఆలోచనలు ఆసేతుహిమాచలం తిరిగివస్తాయి.

'వెంకటశాస్త్రిగారు తమరేనాండి' అంటూ మూడుగంటలవేళ ఎక్కడకో బయలుదేరబోతూవున్న శాస్త్రిగారిని ఓపెద్దమనిషి లోపలికివస్తూ పలకరించేడు. మంచిముఖవర్చస్సు, ఆజానబాహువులూ, పెద్దనుదురు ఆయన్ని బహుఉత్తముడని, ఘరానాకుటుంబములోవాడనిన్ని చెప్పక చెబుతున్నాయి. ఉభయులు గదిలో చాపమీదకూర్చున్నారు. రామారావుకుర్చీలోనే చూస్తూకూర్చున్నాడు. 'అయ్యా! తమనామధేయం. వచ్చినపని' అన్న వెంకటశాస్త్రితో 'నాపేరాండి. సూర్యనారాయణసోమయాజులంటారు. రామచంద్రపురం కాపురస్థలం. మాపెద్దలు తాతగారూ తండ్రిగారూ యజ్ఞాదిక్రతువులు చాలాచేశారు. తాతగారిపేరేనాది. తమదర్శనం చేదామని వచ్చాను. ఇహవారూ వీరూఎందుకు నేనే మనవిచేద్దామనితలంపు. అబ్బాయిగారు చదువుకుంటున్నారని, అక్కగారు బహుయోగ్యులని విన్నాను. అమ్మాయిని తమకడుపులోపేద్దామనితలంపు. మిగతావన్నీ తమయిష్టప్రకారం జరపడానికి అభ్యంతరంలేదు' అన్నాడు ఆయన. ఈసంభాషణశాస్త్రికి చాలావిసుగ్గావుంది. 'ఛా! ఆఖరికి యీచాదస్తపుబ్రాహ్మడితో నావియ్యం' అనుకున్నాడు. 'చదువుపూర్తి అవండే...అనియింకాఏదో అనబోయే శాస్త్రి మాటకి అడంవచ్చి 'తమచిత్తం మా అమ్మాయికేనా పదోఏడు. పెండ్లిమాత్రం జరిగిస్తే చదువు పూర్తిఅయ్యాకే తీసుకు వెళ్లవచ్చును. నాకెటుచూసినా యీపిల్లవక్కర్తేనూ. నే

నయిచెప్పుకోకూడదనుగాని మాపిల్లనిఅందరూ చాలాఅందమైన పిల్లఅని అంటారు. నాకున్నదేదో అమ్మాయిదే. ప్రస్తుతం వెయ్యిరూపాయలుకట్నము. లాంఛనాలుయివ్వగలను. తమకు ఇహాతప్పదు.' అనేపెద్దమనిషిమాట పూర్తిగా వినకుండానే 'మళ్లీకలుసుకుందాం లెండి' అంటూలేచి వెళ్లిపోయేడు వెంకటశాస్త్రి.

'ఏమండీ యిందాకమాట్లాడినాయన రేపువస్తారోమో. ఏంచెప్పదలచేరు' అంది సీతమ్మగారు రాత్రిభోజనాలవేళ అన్నంవడ్డిస్తూను. 'ఏమిటో. నీమొహం. నీపనేదో నువ్వేడుద్దూ. అన్నింటికీ రాక. తనకూతురు చక్కనిదైతేమాత్రం ఏంవోలికింది' అన్నాడు శాస్త్రి. 'మీకడుపులో ఏముందో, మీఆలోచనలేమిటో నాకేంబోధపడ్డంలేదు. ఇప్పటికే రామానికి పెళ్లీడుతప్పింది. అనుకుంటే కంట్రకంకాని యిరవై రెండోయేడు కూడ వచ్చింది. ఇందాకా ఆబ్రాహ్మణ్ణిచూస్తే జాలేసింది. పాపం. ఎంతఇదిగామాట్లాడేడో చూసేరా. మన అమ్మాయిలపెళ్లిళ్లకి ఎన్ని తిప్పలుపడ్డాం. ఇంతకీ వారిచ్చేది మనకేం ఉండిపోతుందాఏమిటి. పిల్ల బాగుంటుందట. పోనివ్వకండి.' అంది ఆవిడ. 'పాపం! అబ్బబ్బా! యీదిక్కుమాలిన ఆడపెత్తనాలమూలాన్ని చచ్చేరోగంవచ్చిందిగదా. ఇహనుంచి నిన్ను సలహాఅడిగే చేస్తూవుంటానులే పన్లన్నీ. అడగక్కురలేదు శోభ. ఈ ఆడపీనుగులు వంటింట్లో చచ్చినట్టుపడిఉండక మహాతెలిసిన వాళ్లలా ఏమిటో చెప్పొస్తూవుంటారు. అసలాడాళ్లు ఎందుకుపుట్టేరో తెలుసా?పనిచేయడానికే. నోరుమూసుకుని నీపనేదో నువ్వేడు. ఆఖరికి ఈ శతంజీవిగాడితోనా వియ్యం. అంటూ ఓ లెక్చెరు కొట్టేడు. 'నాకెందుకూ. మీాయిష్టం వచ్చినట్లు చేసుకోండి' అనీ కళ్లకొంగుతో అద్దుకుంటూ ఊరుకుంది ఆయిల్లాలు.

పిల్లచాలాబాగుంటుందిఅని విన్నప్పటినుంచీ రామారావుకి మనసులోఅదోలాఉంది. యిరవై రెండేళ్లంవాడుమరి. ప్రజ్ఞలెన్నిచెప్పినా పెళ్లాంమీదికి బుద్ధిపోతూంది. 'ఎన్నిసంబంధాలొచ్చినా ఏవోవంకలుపెడుతూనే వున్నావు. అసలు నీకుపెళ్లిచెయ్యాలనిలేదా ఏమిటినాన్నా?' అని సిగ్గువిడిచి అడిగేశాడు. 'ఊంహూం. ఇదా కథ. పిట్టకూతొచ్చిందీ? తల్లీకొడుకూ కూడబలుక్కున్నారా యేమిటి? మీాయిష్టంవచ్చినట్టు అఘోరించండి. నాకేం' అంటూ ఉత్తరాపోశనం పట్టిలేచిపోయేడు శాస్త్రి.

౨

రామచంద్రపురంకాలవలో ఓరాధారీపడవ మెల్లిగావెళుతోంది. వారంతాపెళ్లివారు– ఇంకెవరూకాదు మన వెంకటశాస్త్రిగారే. పడవ పడిచెక్కపూటుగావుంది. హాలులోపెళ్లివారుగాక పైవాళ్లుకూడా కొందరు. సామాన్యంగాపదిమంది ఓచోటపోగయినారంటే సరి లోకంలో విశేషాలెన్నో వినవచ్చు.

కాకినాడలో ఎవరో పెన్షన్ డిప్టీకలెక్టరుగారికి ఒకత్తే కూతురుట. ఆయనమూడోపెళ్లిపెళ్లాము పిల్లట ఆపిల్ల. లక్షరూపాయలికి మించిన ఆస్థిట హారిది. ఆస్థేంలేకపోయినా సరేట మంచిహూపురేఖలున్నవాడై చదువుకుంటున్నపిల్లవాడుదొరికితే ఆపిల్లనివ్వడానికి వెతుకుతున్నారుటవారు.

ఈమాటలు హాలులో వారందరికి వినబడ్డాయి. ఒక్కమాటుఅందరూ అటుతిరిగి ఆ చెప్పేమనిషివేపు ఏదోప్రశ్నించేవారిలాచూసి మళ్లీతమమాటల్లోపడ్డారు. వెంకటశాస్త్రిగారి మొహంమాత్రం ఊసరవెల్లో దానితా

తో అయిపోతోంది. 'సరే అప్పుంచినరు కోంటాం' అన్నమాటలు ఓక్షణమయినాక ఆయన నోటినుంచి అప్రయత్నంగాబయటికి వచ్చాయి.

రాత్రి తొమ్మిదిగంటలైంది. సూర్యనారాయణసోమయాజులుగారి ఇంటిముందరపందిట్లో పెండ్లివాద్యాలు దివ్యంగా మోగిపోతున్నాయి. 'పెండ్లికూతుర్ని చప్పునతీసుకు రండి' అని ఒకరు, 'గౌరీపూజగంప యేగదిలో వుందో కనపడదు' అని ఒకరు. అంతా తలో మాటాఅనేవారేకాని ఒహరుచెప్పేది ఒహరు వినడంలేదు. కన్యాదాత నోట్లుగాకుండా విడిరూపాయలు లెఖ్ఖపెట్టి పళ్లెంనిండపోస్తున్నాడు.

'అబ్బాయిగారూ, కాళ్లిల్లా ఈపళ్లెంలో వుంచండి! సోమయాజులుగారూ! వరకట్నం పళ్లెంయిలా తెప్పిస్తారా! చదవమని శెలవా!' అన్నాడు పురోహితుడు.

సోమయాజులుగారి భావమరదు లిద్దరు రూపాయలపళ్లెం సాయంపట్టి తేచ్చి మధ్యని ఉంచారు. పౌరోహిత్యుడు గొంతుగు సవరించుకొని సభ కభిముఖుడై ...అని ప్రారంభించేసరికి, శాస్త్రిల్లుగారు 'ఉండవయ్యా, ఉః ఒక టేలొందర. ఈపళ్లెంలో దస్తావేజు కాగితం కనపడదేం' అన్నాడు అతిధీమాగా.

'కాగితాలేమిటండి!' అన్నాడుసోమయాజులు నివ్వెరపోతూ.

'కాగితాలేమిటా ! ఒహత్తే పిల్ల నాకు, నాకున్నదంతాపిల్లకే. అని మొదట్లోనువ్వన లేదూ! ఎరగనట్లుమాట్లాడతావేం.' అన్నాడు శాస్త్రిలు.

'భావగారూ! శుభసమయాన్ని మీరీవిధంగా విఘ్నంకల్పిస్తే నేనేమనగలను? నాకున్నదేదో పిల్లకే యిస్తానన్నానుగాని ఇప్పుడే రాస్తానన్నానా! ఇవి కాళ్లుగాని చేతులుగావు. నామనవి విని కార్యంజరగనివ్వండి' అన్నాడు సోమయాజులు శాస్త్రిల్ని చేతులట్టుగు బతిమాలుతూ.

'యింకా కూచుంటావేమిరా!' అని కొడుకునుగద్దింపు గద్దించి ఎవరిమాటా చెవినిపెట్టకుండా విడిదికివెళ్లిపోయాడుశాస్త్రుల్లు. వెనకవెళ్లిన పెద్దమనుష్యులు 'ఎవరిమాటా వినిపించుకోందే యేంచెప్పం' అని ముఖాల్నింతచేసుకుని వచ్చేశారు.

రెండునిముషాలయాక అచేతనుడై ఆలా నిలబడ్డ సోమయాజులు సభవారితో ఈవిధంగాఅన్నాడు! 'అయ్యా! తెల్లవారితే యేప్రేల్ ఒకటో తేదీ. శారదాబిల్లువచ్చి గొంతుగుమీదకూచుంటుంది. కాల తంత్రులంతా చాలాకర్మిష్టులు. నాకైనా ఒకత్తేపిల్ల. కొత్తపధంతొక్క పెద్దలపేరుకి అప్రతిష్ట తేవడం నాసమ్మతిగాదు. ఎల్లాగనాఈలగ్నాన్నే వివాహంఅయి తీరాలి. ఈపిల్లని పెండ్లాడేందుకు యిష్టమున్న పుణ్యాత్ముడెవరేనాఉంటే ముందుకిరండి! ఈడుజోడు కుదిర్తే చాలు. ఇక నేం వద్దు. రండి' అని ఆవేశంతో అన్నాడు.

ఒక్కగడియ అంతా నిశ్శబ్దం.

ఇంతలో సుముహూర్తం చూడడానికి వచ్చినస్త్రీలలోంచి 'నాయనా! కృష్ణా.' అని వినబడింది.

'యేం అమ్మా, చెల్లెలు నిద్దరపోయిందా! ఇంటికి తీసుకువెళ్లనా' అంటూ ఓపిల్లవాడు సభలోకూర్చున్న మగవాళ్లల్లోంచిలేచి అటు వెళ్లాడు.

'చూస్తావేం' అంది అమాత్య దేవి.

ఆమాతాసుతు లిరువురికి కళ్లతోటి యేదో

సంభాషణజరిగింది.

'అయ్యా! నేను ఆకెళ్లవారి అబ్బాయిని. కృష్ణారావుని. రుక్మిణిని పెండ్లాడ డానికి నాకేం అభ్యంతరంలేదు' అన్నాడు అమాత్యవిధేయుడు, సోమయాజులుతో.

'నీవుటోయ్ ఎంత పెద్దవాడవయ్యావు. పట్నంనుంచెప్పుడువచ్చావు. ఏమిటో పెద్దపెద్ద చదువులు చదువుతున్నావుటే,' అన్నా డా వృద్ధుడు.

ఇంతసేపటినుంచీ నిశ్శాంతపోయి చూస్తూన్న రుక్మిణిమొహంమీదికి కల్యాణపుకళ గబుక్కున వచ్చిపడింది. ఆమె ఎంతో సిగ్గుతో కృష్ణుడివేపు వారచూపులు చూస్తూ తలొంచుకుంది. పెండ్లి అయిదురోజులు చాలా వైభవంగా జరిగింది.

౬

ఏదో నేర్చుకోడానికని పొరుగింటికెళ్ళిన రుక్మిణి అంతలోకే 'నాన్నగారూ విన్నారా?' అంటూ పరుగెత్తుకువచ్చింది. 'ఏమిటమ్మా! కృష్ణమూర్తి ఏవేనా బంతాటల్లో గిన్నెలు గెలిచాడా ఏమిటి?' అన్నాడు సోమయాజులు కుమార్తెతో, నవ్వుతూ.

'అబ్బా ఏమిటినాన్నా ఎప్పుడూ నీకిదే పని. అదికాదు. ఆవేళ మనింటికి పెళ్ళంటూ వచ్చాడే, ఆశాస్త్రిలు ఎందుకలాగ చేశాడనుకున్నావు, మనవెంకమ్మత్తగారి జానకి చెప్పింది, ఆవిడత్తారు కాకినాడే కాదుమరీ. మనింటికి పెళ్ళికొస్తుంటే పడవలో ఎవరో చెప్పుకుంటూంటే విన్నాడట ఆ శాస్త్రుల్లు. కాకినాడలో ఓకలక్టరుగారు కూతురికి సమ్మంధాలు వెతుకుతున్నాడనీని, ఎంతో ఆస్తి యివ్వదలిచాడనీని. దాంతో ఈబ్రాహ్మడికి మతిపోయిందట. మనింటినుంచి ఇంటికి కూడా వెళ్ళకుండానే సరాసరి అవూరే వెళ్లాడుట. మనింట్లో ఆయన జరిపిన కథంతా అయనకన్న ముందే వెళ్ళిందట అవూరు. ఆ కలెక్టరు ఈ బ్రాహ్మడితో అసలు మాట్లాడనేలేదుట. పాపం బ్రాహ్మడెంతాశపడ్డాడో. మంచిపనిజరిగింది.' అంది రుక్మిణి.

'అదాసంగతీ! పోనీలే! ఆశాస్త్రిలు పెళ్లాంపాపం ఎంతమంచి దనుకున్నావు' అంటూ ఏదో చెప్పబోతూన్న సోమయాజులు మాటకి అడ్డంవచ్చి 'మనసమ్మంధం చెడిపోయాక ఆవిడసలు మంచంమీంచి లేవడమే లేదుట. నాకు కోడలు ముచ్చటలేదో తీరే యోగమేవుంటే పీటలమీదిపెళ్ళి ఆవిధంగా చెడేపోదు; అంటుందిట. జానకి ఎంతో యిదిగా చెప్పింది' అంది రుక్మిణి.

'పోనీలేఅమ్మా! దేవు డేదిచేసినా మనమేలుకే అంటూ తాతయ్య అంటూండేవాడు, జ్ఞాపకంవుందా' అన్నాడు సోమయాజులు.

## యువ కార్యాలయ ప్రచురణాలు

ఆధునిక వాఙ్మయంలో చిన్న కథ అత్యుత్తమస్థానం సంపాదించుకున్నది. కాని పత్రికలద్వారా చిన్న కథకు మంచి ప్రచారం లేకుండాఉంది. ఇప్పుడిప్పుడు కొత్త పోష్టలు రూల్సుకూడా రావటంమూలాన పత్రికలలో కథల పాలు తగ్గించవలసివచ్చింది.

ఈ పరిస్థితుల్లో యువకార్యాలయ ప్రచురణాలు పాఠకలోకానికి పెద్దకొరత తీరుస్తవనటానికి సందేహంలేదు. మీా అభిమానానికి పాత్రులైన కథకులు-మీారు ఎవరికథల కొరకై పత్రికలు కొంటూవుంటారో ఆరచయితలు రాసిన కథలు నెల నెలకు ఒక పుస్తకంగా పైకార్యాలయంవారిచేత ప్రకటించబడుతూవుంటై. పత్రికల మాదిరిగా అంతర్హితమైపోవు. క్రౌనుసైజున షుమారు నూరుపేజీలు. వెల నాలుగణాలు మాత్రమే.

వెంటనే ఈప్రచురణాలకు చందాదార్లుకండి. సంవత్సర చందా రు. 3—0—0 మాత్రమే.

### వెలువడిన గ్రంథాలు

కారుణ్యం. (ఫిబ్రవరి 1937)
కొడవటిగంటి కుటుంబరావు.

పాపం!!! (మార్చి 1937)
గుడిపాటి వెంకటచలం.

"రూమ్ టు లెట్." (ఏప్రిల్ 1937)
పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి

కాంతం కైఫీయతు. (మే 1937)
మునిమాణిక్యం నరసింహారావు.

బిడ్డల ఆరోగ్య బలమునకు

## స్వామీాస్ 'బాలజీవన్' (రిజష్టర్డు)

అమృతమువంటిది.

బిడ్డలయొక్క అన్నివ్యాధులను తొలగించి నూతనజీవనము యిచ్చునట్టి అమృతతుల్యమగు ద్రావకము. బిడ్డల అజీర్ణము, కడుపునొప్పి, జ్వరము, విరేచనములు, వాంతులు, జలుబు, కఫము, మొదలగు సర్వవ్యాధులను తొలగించి ఆరోగ్యమొసగును.

వెల ఔన్సు సీసా రు. 0-6-0.
4 ఔన్సుల సీసా రు. 1-4-0.

---

కాల్పులు, నరకులు, నొప్పులకు

## 'సీతమలామా' (రిజష్టర్డు)

సంజీవివంటిది.

అన్నిచర్మవ్యాధులకు పైనవ్రాయుటకుపయోగించు ఓషధీమలామా. కాల్పులమందుగా ప్రఖ్యాతిగాంచినది. మూలవ్యాధిని, ముఖముపై మొటిమలను తొలగించును.

వెల ½ ఔన్సు సీసా రు. 0-6-0.
2 ఔన్సుల సీసా రు. 1-4-0.

---

మావద్ద ఇంకను పెక్కు ప్రశస్తమైన ఔషధములు గలవు. మా ప్రత్యేక ఔషధ కేటలాగునకు వ్రాయుడు.

ఏజంట్లుగా నుండగోరువారు మాకు వ్రాసిన వివరములు తెలుపగలము.

## అశ్వినీకుమార ఫార్మసీ

నర్సాపురం, పశ్చిమగోదావరి జిల్లా.

# జాన్ యఫ్. స్టీవెన్సు

కనడా పసిఫిక్ రైలు రోడ్డును,
గ్రేట్ నార్తరన్ రైలు రోడ్డును,
పనామా కాలువను
నిర్మించిన మహనీయుడు.

జాన్ యఫ్. స్టీవెన్సునామమును మీరు ఇంతవరకు ఎఱిగి ఉండకపోవచ్చును. కాని అతడు కనడా పసిఫిక్ రైలురోడ్డును, గ్రేట్ నార్తరన్ రైలు రోడ్డును, పనామాకాలువను నిర్మించిన మహనీయుడు.

కొండలను వంతెనలతో కలిపియు, కొండలను ప్రదక్షిణించియు, కొండలను దొలచియు అతడు రెండు రైలురోడ్డులను నిర్మించినాడు. దక్షిణ అమెరికాకును ఉత్తరఅమెరికాకును నడుమ పనామా కాలువనుత్రవ్వి అట్లాంటిక్ మహాసముద్రమును, పసిఫిక్ మహాసముద్రమును ఒండొంటితో కలిపినాడు.

మూడును మూడుబ్రహ్మాండకార్యములు.

కొండలమీదుగా, కొండలచుట్టుగా, కొండల నడుముగా స్టీవెన్సు నిర్మించిన రైలుబాటలమీదుగా వేలకొలదిరైళ్లు నిరంతరము పరుగులెత్తుచున్నవి.

ఉత్తర దక్షిణ అమెరికాల నడుముగా అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రములను కలుపుచు అతడు త్రవ్వించిన పనామా కాలువగుండా వేలకొలది ఓడలు నిరంతరము ప్రయాణించుచున్నవి.

1930-వ సంవత్సరమునాటికి అతనికి డెబ్బదియైదు సంవత్సరములు. నిండు నలుబదివత్సరములు అతడు మాసము మాసము పనులసందర్భమున ప్రాణాంతకములగు ప్రమాదములకు గుఱియగుచుండువాడు. ఒక్కొక్కప్పుడు అట్టిప్రమాదములు అతనికి ప్రతిదినమును కలుగుచుండునవి. వానినెల్లను అతిక్రమించి అతడు డెబ్బదియైదు సంవత్సరములకు పైబడి బ్రతికినాడు. బ్రతికినంతకాలమును బద్ధకమెఱుగక పని చేయుచుండువాడు.

అతడు తన జీవితకాలమంతయు అసంభవకార్యములను సంభవకార్యములుగా చేయుటయందే గడపెను. అతని పని ఏనాటికానాడే క్రొత్తది. ఒక దినమునకూడ అతనికి రొటీన్‌పని అనునది ఉండకుండెను. ఇతర మానవమాత్రులు చేయుగల ఏపనిని గాని అతడు చేయలేదు. అనగా అతడు చేసినపనులు ఇతర మానవు లెవ్వరును చేయజాలనివి అనుట.

ప్రపంచమునందలి ఇంజనీర్లకును, రైల్వేమెన్లకును అతడు చిరపరిచితుడు. యుద్ధసమయమున మిక్కిలి కష్టపుపనియొకటి అతనికి ఈయబడెను. సైబీరియన్ రైల్వేయాజమాన్యమే ఆకష్టపుపని. 1920-వ సంవత్సరమువఱకును ఆరైల్వేమీద రైళ్లు సాగుచుండుటకు తగుబందోబస్తును అతడు చేయగలిగినాడు. కాని బోల్షివిజము వెల్లువవలెవచ్చి సైబీరియాను ముంచెత్తినపుడు స్టీవెన్సు సైబీరియన్ రైల్వే యాజమాన్యమును వదలివైచి వచ్చినాడు. ఈ ప్రపంచమున స్టీవెన్సు అంతవానికికూడ నమలరాని నారికేళములైయుండునవి కొన్నిగలవని అప్పుడు అనుకొనవలసి వచ్చినది.

జాన్ యఫ్. స్టీవెన్సు యొక్క భావిఅభివృద్ధిని సూచింపగల అనుకూల్యములేవియు బాల్యమున అతనికి లేకుండెను. అతని తండ్రి ఒకచిన్నపట్టణము చెంత నివసించుచుండిన పేదరైతు.

స్టీవెన్సు చిన్నతనమున సామాన్యముగు చిన్న పాఠశాలకుపోయి ఏవియో రెండుముక్కలు నేర్చుకొనెను. అంతియేకాని అతడెన్నడును కళాశాలలో

కాలుపెట్టి యెఱుఁగడు.

పెరిగి పెద్దవాఁడైనపిమ్మట వృత్తివిద్యలకు సంబంధించిన పుస్తకములు పత్రికలు చదివి విద్యాభివృద్ధి గావించుకొనినాడు.

పగలంతయు పనిచేయువాడు-సగము రాత్రివఱకును చదువువాడు. ఇట్లని అతనిమిత్రులు చెప్పుదురు.

అతని జీవితములో అతనికి ప్రథమసదవకాశము 1882లో సంభవించెను. మానిటోబా గుండాను, కొండలమీదుగను కనేడియన్ పసిఫిక్ రైల్వేను నిర్మించుపనికి అతడు కుదురుకొనెను.

కనేడియన్ పసిఫిక్ రైల్వే ఒకానొకపందెముపై నిర్మింపబడియుండుట పెద్దలజ్ఞప్తినుండి ఇంకను లొలగియుండదు.

రైల్వేకంపెనీవారికి కనేడియన్ గవర్నమెంటువారు ఇట్లు చెప్పిరి :

'పదియేండ్లలోపుగ మీరీరైల్వేను నిర్మించుచో మేము మీకు ఏబదిలక్షలపౌనుల ధనమును, రెండుకోట్లయకరముల భూమియు ఇత్తుము. కాని పదిసంవత్సరములలోగా మీరు ఈరైల్వేను నిర్మింపజాలరా మీకు ఏమియు నీయజాలము.'

అందుపై రైల్వేకంపెనీవారు జాన్ యఫ్. స్టీవెన్సుకు కబురుపంపి రప్పించి 'కనేడియన్ పసిఫిక్ రైల్వేనిర్మాణ మంతయు నీచేతులలో పెట్టుచున్నాము. నిముషములమీద పనిని గావింపుము.' అని చెప్పినారు.

చెప్పుటయే తడవుగా స్టీవెన్సు అంగీకరించినాడు. అంగీకరించుటయే తడవుగా పనికి ప్రారంభించినాడు. ఆరునెలలలో విన్నిపెగ్ నకు పశ్చిమమున వేయిమైళ్లవఱకు రైలుబాట నిర్మించినాడు.

మూడువేల అడుగులఎత్తున ఉన్న కనుమలను వంతెనలమూలముగ కలిపినాడు. కొన్ని పర్వతములను దొలుచుకొనిపోయినాడు. కొన్ని పర్వతములను చుట్టిపోయినాడు. పోవలసినప్రదేశము నంతను అతిక్రమించినాడు. తానువేయవలసిన రైలుబద్దెలలో తుదిజంటను పసిఫిక్ మహాసముద్రతీరమునందు వాన్కొవరునందు స్థాపించినాడు.

ఐదుఏండ్లలో రైల్వేనిర్మాణము ముగిసినది. గడువు ఇంకను ఐదుసంవత్సరములుగలదు. సగకాలములో - అతను పనిని పూర్తిచేసినాడన్నమాట.

అప్పుడు జేమ్సు జె. హిల్-లోకప్రఖ్యాతిగల కనడానాయకుడు-స్టీవెన్సుకు వర్తమానము చేసి గ్రేట్ నార్తరన్ రైల్వేనిర్మాణభారమును అతనిపై పెట్టెను. కనడాపసిఫిక్ రైల్వేవలె గ్రేట్ నార్తరన్ రైల్వేకూడ కొండప్రదేశములగుండా పోవలసినదే. అయినను స్టీవెన్సు వింధ్యపర్వతమువంటి పర్వతమును కూడ వంగదీయగలఅగస్త్యుడు, రెక్కలుగల కొండలనుకూడ పిండికొట్టగల వజ్రాయుధుడు. అగుటను అతడు గ్రేట్ నార్తరన్ రైల్వేనిర్మాణమునుగూడ అచిరకాలముననే ముగించెను.

అనంతరము అతనిపై పనామాకాలువత్రవ్వు భారము మోపబడెను. ఆపనినికూడ అతడు అచిరకాలముననే ముగించెను.

క్రొత్తప్రపంచమున ప్రయాణమును సుకరమైనదిగాను, సువేగమైనదిగాను. సురక్షితమైనదిగాను చేసినవారిలో స్టీవెన్సు మేటి. మహాసముద్రముల మధ్యనున్న అడ్డులను అతను అలవోకగా తొలగించివైచినాడు.

స్టీవెన్సుతో కలసి పని చేసినవారందరును అతనిని గాఢముగ ప్రేమింతురు. అతడు నిగర్వచూడామణి, సాధుస్వభావుడు, పెద్దమనిషి.

అతనిది గొప్పజీవితము. పూర్వవీరుల జీవితముతో సరిపోల్పతగినది. అతని ప్రయోజకత్వముచే నిర్మింపబడిన రైల్వేలు, పనామాకాలువ అతని నామమును ఇచట శాశ్వతముగ నిలుపగలవు. మఱియు అచట పర్వతశిఖరములలో అత్యున్నతమైన ఒక దానిపై బ్రహ్మాండాకృతిగల అతని కంచువిగ్రహ మొకటి నెలకొల్పబడియున్నది.

అతని భౌతికదేహము కొండలను పిండిచేసినది. అతని కాంస్యదేహము కొండల నెత్తినెక్కినది.



# ఆడజమానా

రచయిత:

కొడవటిగంటి కుటుంబరావు

ఇది ప్రపంచచరిత్రలో అపూర్వమైన సంగతి. ఇటువంటిది ఎప్పుడూ ఎక్కడా జరిగిఉండలేదు—ఆడమళయాళమూ, ప్రమీలా రాణియొక్క స్త్రీసామ్రాజ్యమూ కూడా దీనికి చాలవు, బాగా ఆలోచించిచూస్తే. ఇది మనరాష్ట్రంలోనే, మనదేశంలోనే వచ్చిపడ్డ దనుకోటానికి ఎంతమాత్రమూ వీలులేదు. ఈవిపత్తు జగత్తునంతా ఆవరించింది, ఇది—ఈ ఆడప్రభుత్వం.

నామాటలు నమ్మలేకుండా ఉన్నవారు, నేను కాస్త ఉంటే గంపెడు చేస్తున్నాననుకునేవారు, ఎవరైనా ఉన్నారా? తొందరపడకండి. ఓపికపట్టి నిదానంగా ఆలోచించండి. నాది ఎంతసూక్ష్మబుద్ధో తమకందరికీ తెలుసు కనక నేను ఆత్మశ్లాఘం చేసుకోవలసిన అవసరం కూడాలేదు, అదృష్టవశాత్తూ. సత్యాన్వేషణలో నేను ఎంత ఆరితేరిన చెయ్యినో నేనే చెప్పకుంటేమాత్రం యేమంత బాగుంటుంది కనకా! ఇక ఇంటి ఆడవాళ్ళతో పోట్లాడి సన్యసించే మచ్చుకూడాకాను నేను. కనక నేను కేవలమూ నిజమే, అదీ నిష్పక్షపాతంగా, చెబుతున్నానని తమరు నమ్మి ఈవ్యాసం చదవాలని నాప్రార్థన.

ఇది ఆడజమానా అన్నాను. మరి మనసంఘంలో ఆడది ఎక్కిరావటానికి వీలులేకుండా చాలా ఘట్టి బందోబస్తు చేశామే—అనగా పుట్టిననాటినించీ దాసీత్వానికి తరిఫీదుచేస్తూ, అడ్డమైనవాళ్ళకు అణిగి పడివుండమని ఉద్బోధించే కుమారీశతకం వగైరా గ్రంధాలే చదివిస్తూ, నిరపాయకరమైన పాతివ్రత్యం వారికి దాటరాని ఆదర్శంగా పెట్టి, స్త్రీ పురుషవిచక్షణతేలేని వయసులోనే దక్షిణ (వరశుల్కం) సహితంగా యేఅయ్యచేతులోనో పెట్టి, వారికి ఎటువంటిహక్కులూ—కనపడటం, వినపడటం, వోటుచెయ్యటం, ఆస్తిపంచుకోటం, జీవితాన్ని భీమా చేయించుకోటం మొదలైనవి—లేకుండాచేసి వాళ్ళకెక్కడా ఊపిరి

సలపకుండా నవరంధ్రాలూ బిగించి ఉన్నామే. సాంఘికంగాకూడా వాళ్లు ఇష్టంలేని భర్తను వదిలెయ్యటానికి వీలులేకుండా, మరోపెళ్లాడటానికి వీలులేకుండా, అదృష్టవశాత్తూ మొగుడుపోతే జుట్టుంచుకోటానికీ పూలుపెట్టుకోటానికీ రెండుపూటలా భోంచెయ్యటానికీ మంచి బట్టలు ధరించటానికీ అర్హతలేకుండాచేసి, మన మూఢవిశ్వాసాలు కూడా వాళ్ళకు అపకారంగా ఉండేట్టు చేశామే ; ప్రాకృతంగాకూడా వాళ్లు నెలకు మూడునాళ్లు వాకిటఉండటం, అది తప్పించుకున్నారా, తొమ్మిదినెల్లు గర్భంమోసి ఆఖరుకు చచ్చేటంతపని అయి ప్రసవించటం జరుగుతున్నదే—ఇంత నిర్బంధంపాలయిన స్త్రీజాతి, అబలాజాతి, మన మీాద ప్రభుత్వం చెయ్యటమేమిటి? తెలిసి మాట్లాడుతున్నావా! అని నన్ను తమరు ప్రశ్నించవచ్చు.

అక్కడే ఉంది తిరుగుడంతా! వాళ్ళనుచూస్తే మనకు ఏదో భయంలేకపోతే మనం ఇంత ఎందుకు చెయ్యవలసివచ్చిందీ? 'ప్రకృతి ఎట్లాగూ స్త్రీజాతిని కనికరించలేదుకదా, ఆవార మనం వాళ్ళకు సంఘంలో ఉన్నతస్థానంఇచ్చి వారికి న్యాయంచేదాం' అని మనం ఎందుకు అనుకోలేదూ? వారి అబలాత్వం మనం నమ్మలేదు, వారిశక్తి మనం ఎరుగుదుం. మగవాడిబలం సమ్మెటయొక్కబలం. ఆడదానియొక్కబలహీనత్వం విద్యుచ్ఛక్తిని మోసుకుపొయ్యేతీగల బలహీనత్వం. ఈఆడవాళ్ళుండే అట్లా నిస్సహాయులల్లే కనిపిస్తారు. ఆధారం లేకపోతే తోటకూరకాడలల్లే వేళ్లాడబడి పోతారు; వాళ్ళజోలికి పోయినామో చచ్చేషాక్ తగులుతుంది!

మళయాళస్త్రీలూ వెనకటి ప్రమీలరాణీ మొదలైనవారి ప్రభుత్వం ఒక ప్రభుత్వమా? మనల్ని చంపి మింగగల సింహానికీ మనలోపల ప్రవేశించి చంపే క్రిమికీ ఎంతభేదముందో అంతభేదముంది ప్రమీలరాణికీ మనల్ని పరిపాలిస్తున్న స్త్రీలకూ. నేను స్త్రీనైతే నాకు ప్రమీలరాణియొక్క హక్కులక్కర్లేదు. అవన్నీ ఇవ్వటముండే, అది ఎలెక్ట్రిక్ తీగను తెంచి కొరడాతాడు చెయ్యటమే!

ఇక ఆడవాళ్ళప్రభుత్వం మనసంఘంలో ఏవిధంగా నడుస్తున్నదో చూతాం. మొట్టమొదట మనం తెలుసుకోవలసిన విషయం ఏమిటంటే పురుషుడికి స్త్రీ గార్డియన్. స్త్రీ పురుషుడికి దాసీఅనుకోవటం పురుషుడి అవివేకం. మగవాడిమతాన్ని, ఆచారాలను, నాగరికతను పట్టుకొస్తున్నది ఆడది. చివరకు ఇలిగాడిమాతృభాషకూడా ఆవిడగారి పోషణ




లో నేడుంది—ఇతగాడు పిల్లలతోపాటు.

పురుషుడనే పక్షి పొడుగుపాటి దారంతో స్త్రీఅనే రాతికి కట్టబడిఉంది. అందుచేత ఈపక్షి ఎటు ఎగరబోయినా యీరాయే అడ్డం వచ్చి, ఎటుచూసినా కృష్ణుడే కనిపించిన కంసుడివలె అవుతుంది ఈ పోతుపక్షి. మగవాడు ఎంత గొప్పవాడయి కూర్చుంటేమాత్రం ఏం లాభం—తనభార్యయొక్క భర్తకాకుండా పోలేకపోయిన తర్వాత!... వెనక ఒకసారి నేను ఒక గొప్పవాడి భార్యను చూశాను. నాతో ఆవిడ మాట్లాడలేదు ఊరికే చూసింది—'నాభర్తను ఎరుగుదువుగదా! నావంకచూడు.నువ్వంత గౌరవంగాచూస్తున్న ఆవ్యక్తిని మెల్లి మెల్లిగా కబళించివేస్తున్నది నేనే. ఆయన ఇంటికిరాగానే చూడవలిసింది నా మొహం, భోజనంచేయవలిసింది నాచేతులసహాయంతో, సిగ్గుపడవలసింది నన్నుచూసి, తప్పించుకుపోలేంది నానుంచి' అన్న దామెచూపు. నేను ఎందుకో ఆమెనుచూసి భయపడ్డాను. ఆయన్నుచూస్తే జాలి వేసిందికాని వెనకటి గౌరవంపోయింది. అన్యాయమే. ఆవిడను ఆయన తనకుతానై పెళ్లాడిఉండడు—ఆయన తల్లీ వాళ్లూ చేసిఉంటారు!...

పురుషుడు డ్రీమర్—ఏకాంతంగా కూర్చుని కలలుకంటూ ఉంటాడు: 'ఈవిధంగా కాలంవెళ్ళబుచ్చుదాం, మనపిల్లలను ఈవిధంగా తయారుచేదాం...'అని. కాని తీరా చెయ్యవచ్చేటప్పటికి ప్రతిదానికీ అడవి అడ్డంవస్తుంది—బలంచేతగాదు, ఉపాయంచేతకాదు; మనం ఊహించనైనా లేని ఒకానొక శక్తిచేత.

మగవాడిదాసీఅన్నట్టు నటిస్తూ ఆడది మగవాడిసుఖం యావత్తూ తన అరిచేతులలో పెట్టుకుంది. తిండిసుఖందగ్గరనించి రతిసుఖంవరకూ పురుషుడు స్త్రీ అనుమతిమీద ఆవిడ ఇవ్వదలచిన స్వరూపంలో పొందాలి. ఒకఇల్లాలు ప్రతివంటకంలోనూ కారంవెయ్యవలిసిన దానికి రెట్టింపు తక్కువకాకుండా వేస్తుంది. ఆవిడ జ్ఞాపకంవచ్చినప్పుడల్లా, 'పాపం, ఈవిడ భర్తకావాలన్నా కారంతక్కువగా తినలేడుకద! ఆయన జన్మకు కారంలేకుండా తినటంఏమిటో తెలియదుకద.' అని అనుకుంటాను, నాగుండె పగిలిపోతుంది; ఎప్పుడైనా ఒకపూట ఎవరింటికైనా భోజనానికిపోలేడనికాదు, అట్లా ఎంతకాలం జరుగుతుందీ?



ఆవిధంగానే సన్ననిభార్యగలభర్తకు బొద్దుగాఉండే భార్య ఉంటే ఎట్లాఉంటుందో తెలియదుకద!



భార్య పిల్లలను రోతగా పెంచేదైతే భర్త ఏమిచెయ్యటానికీ లేదు కద!

ఇటువంటి ఇబ్బందులు భార్యలకుమాత్రం లేవా అని అడగ వచ్చును. లేవు! సన్ననిభర్తకూ లావుపాటి భర్తకూ భేదం తెలియదు సామాన్యస్త్రీకి. స్త్రీ దాదాపు ఎటువంటి భర్తతోనైనా సంసారం చెయ్యగలదని హావెలాక్ ఎలిస్ చెబుతున్నాడు. మిగతావిషయాల్లో 'చేత' అంతా ఆడదానిదేకనక 'ఫిర్యాదు' లేదు.

పురుషుడు ఎంత 'పాడిచేసిన' వాడైనాసరే ఇంటికివచ్చినతర్వాత తను చదువుకున్నదీ, తను అనుభవంమీద నేర్చుకున్నదీ తను బుద్ధికుశలతవల్ల ఊహించినదీ, అంతా మరిచిపోలేక పోయినాడో ఇంట శాంతి ఉండదు. ఇప్పటికాలపు యువకులు భార్యలతో సుఖంగా కాపరం చెయ్య లేకపోవటానికి కారణం తగినవేదాంతం లేకపోవటమే. ఆడదాని అధికారం సహించగలగటానికి మగవాడికి ఎంతవేదాంతమైనా అవసరం.

ఫెమినిజం అనేది ఆడదానికి పరమశత్రువు. ఆమె పరిపాలన కింద మగవాడు తనమనస్సును చంపుకుని సిగ్గుమాలినవీ, అర్థంలేనివీ అనేకపనులు చెయ్యవలిసి ఉంటుంది. ఏకుర్రవాడో కొత్తగా మనస్సు వికసిస్తున్న ఉద్రేకంతో 'నేను బూజాలతోసహా కార్యంచేసుకోను, శాస్త్రోక్తంగా మైలా పురుడూ పట్టనూ, అదిచెయ్యనూ, ఇదిచెయ్యనూ' అంటుంటే వింటే నాకు నవ్వువస్తుంది. చివరకు ఆడవాళ్లుఎట్లాగో వాళ్ళయిష్టం సాధించితీరుతారు. నాస్నేహితుడొకడు పంతంకొద్దీ మైల ఇంట్లోకలిపాడు. 'అవన్నీ ఎట్లాతడుపుతారో చూస్తానూ' అన్నాడు ఇంట్లో మయిలపడదగిన వస్తువులన్నీ ముట్టుకుని. వాళ్లు వాటినన్నిటినీ తడపలేదు, నిజమే, కాని వాడివంటిమీద బట్టలుమాత్రం తడిపితీరారు. నాస్నేహితుడు వెధవమొహంపెట్టి, 'అర్థం ఏమిటి?' అన్నాడు- ఆడవాళ్ళకు అర్థంతో పనిఉన్నట్టు.

సంసారపక్షంగా అవసరంకలిగే వైద్యమూ, నీతీ, న్యాయమూ, ప్రపంచజ్ఞానమూ, శాస్త్రపురాణపరిచితీ, కళాభిజ్ఞతా ప్రతిఆడదానికీ ఉన్నది. ఒకఊళ్ళో ఒకకుర్రవాడు చెట్టుమీదినించి పడి కాళ్లు విరుచుకున్నాడు. పొరుగింటి ఆడవాళ్లు మంచివైద్యం చెప్పారు—సలసలా కాగే ఉడుకునీళ్లుపోసి రోగికి పెరుగన్నం పెట్టమన్నారు, ఆకుర్రవాడు రెండురోజుల తరవాత చచ్చాడు. ఆఉడుకునీళ్లుపోస్తుంటే వాడు పడ్డ

బాధ వర్ణనాతీతం. (నిజంగా జరిగింది. కొ.కు.) ఈఘటననుగురించి ఏవిధమైన వ్యాఖ్యానమూ జరగలేదని నేను వేరే చెప్పనక్కర్లేదు.

అదే మగవాడు ఇంటో ఆడవాళ్లు తెమ్మన్న డాక్టరును తీసుకు రాకపోయినాడో మరోడాక్టరువల్ల రోగాలు నయమవుతున్నా ఇంట్లో శాంతిమాత్రం ఉండదు.

ఆడవాళ్ళకు ఇంత అధికారం ఎట్లావచ్చిందంటే సులభంగా చెప్ప వచ్చును, 'సృష్టిలోనే వాళ్లు శక్తిస్వరూపిణులు' అనేసి. కాని ఆ అధికారాన్ని దక్కించుకోటానికి వాళ్ళప్రకృతి ఏవిధంగా తోడ్పడుతున్నదో తెలుసుకోవటం చాలా అవసరం.

స్త్రీకి సిగ్గులేదు. అందుకనే ఆవిడ పరభృతంగా ఉండగలదు. అందుకనే పురుషుడు తన స్త్రీదుష్ప్రవర్తనకు సిగ్గుపడ్డట్టు స్త్రీ తన పురుషుడి దుష్ప్రవర్తనకు సిగ్గుపడదుకూడా. సూక్ష్మవిచక్షణచేసేటంత నాజూకు స్త్రీకిలేదు. అందుకనే దేనితోనైనా సరిపెట్టుగోగలదు. స్త్రీ లిఖితపూర్వకంగా అధికారంకోరదు. ఆ అధికారాలు దక్కేవికావు. స్త్రీకి నిజమైన న్యాయబుద్ధి, సత్యాన్వేషణపరతా లేవు. అంతస్సాక్షీ కూడాలేదు. మనల్ని ఆకర్షించేది స్త్రీలో బోలెడంత ఉండికూడా మనకు అసూయకలిగించేది స్త్రీలో ఈషణ్మాత్రంలేదు.

స్త్రీ సంఘంలో అతిహీనస్థానాన్ని ఆక్రమించటానికి అంగీకరించింది. నిరాయుధురాలుగా ఉండటానికి ఒప్పుకుంది. మనకు తనతో బోలెడంత అవసరం కల్పించుకుంది. ఇవన్నీ మనల్ని మింగేస్తున్న మార్వాడీలు చేసేపనులే.

మన కీస్త్రీజులుం తప్పాలంటే ఒక్కటేమార్గంఉంది. పురుషులకు స్త్రీలతో సమానమైన హక్కులివ్వండి. స్త్రీలకి వృత్తుత్తఅధికారాల మీద భ్రమపుట్టించండి, వాళ్ళమీదిభారం తగ్గించి బాధ్యత ఎక్కువ చెయ్యండి. దానితో వాళ్ళ నిరంకుశత్వం కట్టుతుంది. పాశ్చాత్య దేశాలలోలాగే మనకూ స్వాతంత్ర్యం వచ్చేస్తుంది.

చదువుకుని 'పురుషులతో సమానమైనహక్కులు' సంపాదించిన స్త్రీలను చాలామందిని చూశాను. అంతా కోరలుతీసిన త్రాచులు—నామాట నమ్మండి.



# గంధంవోలువు వేలుపు

రచయిత:

కవికొండల వెంకటరావు, బి. ఏ., బి. ఎల్.

శ్రీ సింహాచలస్వామి ఆది వరాహనరసింహస్వామి అయినా, నాలుకచివరకు వచ్చీసరికి 'సింహాదిరప్పన్న' 'సింహాదిరప్పన్న' అని అనెయ్య బుద్ధి వేస్తుంది: అదేమిటో? 'అప్పన్న' శబ్దం ఇది అచ్చ తెనుగుగాకూడా తోస్తుంది. అయినప్పటికీ ఈశబ్దాన్ని తీసుకుపోయి చాలామంది 'నరసింహం'తో ముడెట్టి 'అప్పల్నరసింహం' అని వ్రాసుకుంటారు. 'అప్పన్న నరసింహము' అనికూడా కాదు. మొత్తంమీద బాగా ఆలోచించిచూస్తే సంస్కృతంమీద ఆంధ్రము బాగా నెత్తెక్కి ఆడినరోజుల్లో 'అప్పన్న' అనే శబ్దం 'ఆది వరాహనరసింహస్వామి'కి జతపడివాటినన్నింటినీ దిగమ్రింగి తానేకొండకు కోమరై పోయినట్టు కనిపిస్తుంది. కాకపోతే పాటల్లోకూడా మేళవింపుగా అతుక్కుపోయి 'సిమ్మాదిరప్పన్న సేవలే సేదాము' అని అంటూ ఆంధ్రలోకం ఈమచ్చుగా తాండవించనేరదు.

ఈ 'అప్పన్న' ఏంచేశాడయ్యా ఇంతకీర్తి సంపాదించడానికి అనేవిషయంకూడా ఆలోచించవలసిందే. అప్పన్నఅంటే మనిషీ కాదు దేవుడూ కాదు నిజానికి పట్టిచూస్తే. అతడు అచ్చోసిన ఆంబోతు. దాన్నే కొన్నిచోట్ల 'తోటపెద్దు' అని ప్రాంతీయంగా వాడుతూ వుంటారు. అచ్చోసిన ఆంబోతంటే వేత్తే వర్ణించాలా? నిగనిగలాడే ఎత్తైనమూపురం, గణగణలాడే చిరుగంటలు, ఆచిరుగంటల్లో రింగులోసుకొంటూ వ్రేలాడుతూవుండా అన్నంతశోభస్కరంగా కానవచ్చే గంగడోలు, ఖచ్చితమైన పుచ్ఛం, సుముఖమయినముఖం, నొష్టను పసుపు, పిఱ్ఱల్నిముద్రలు, ఇంకా ఇంకా చెప్పరాని సింగారం ఎంతో వొలికించేస్తూవుంటుంది. గుఱ్ఱంఏమిటి, గొఱ్ఱేమిటి, ఇఱ్ఱేమిటి, జఱ్ఱేమిటి, ఏజంతువైనా వయసొచ్చి స్వైరంగా తిరుగుతూవుంటే చూడ ముచ్చటేస్తుంది. అందులో మనఅప్పన్న ఆంబోతుకూడాను! అంటే పెద్దావుకుపుట్టి చిన్నావును ప్రేమించే ధీరోదాత్తనాయకుడాయిరి! గొప్పగా కనిపించడుమతీ? అందఱి దృష్టి ఆకర్షించేస్తాడు ఒక్కొక్క సమయాన్ని అంకెవేశాడాఅంటే! ఒక్కసారి కొమ్ముల్తో తొలకరి తడీపొడీ పట్టి రెమ్మేశాడా అంటే!

ఇటువంటి స్వైరవిహారి అయిన ఆంబోతుకూ, ఒక్కచోట బుద్ధిమంతితనంగా వెలిసిన ఆదివరాహనరసింహస్వామివారికీ పరిచయం ఎలాకలిగిందీ అనేది మిక్కిలీ తఱచి తెలుసుకోదగ్గ విషయమే!

వరాహనరసింహులవారు సింహాచలం కొండను వెలిసి విలసిల్లడానికి మహత్తర కారణాలు రెండు గనిపిస్తాయి. ఒకటి మత్స్యావతారమైనాక, కూర్మావతారం, కూర్మావతారమైనాక వరాహావతారం, అది అయినాక

నరసింహావతారం—అవతారాలు పదీకూడా మనభారతవర్షంలో తమతమ స్థానికబలాలు నిర్ధారణచేసుకోవడంలో కొంత వాడిచూపు వినియోగించాయి అని నాతాత్పర్యం. మత్స్యావతారం భూమ్మీద నిల్చే అవతారం కాదు. అయినప్పటికిన్నీ అది భారతవర్ష భూఖండాన్ని సుప్తివంతమై హిమవత్పర్వతంక్రింద అస్థిపంజరప్రసిద్ధిని విలసిల్లుతూవుందని నా నిశ్చితాభిప్రాయం. మఱి కూర్మావతారం శ్రీకూర్మంలో మనందఱికీ కనబడుతూనేవుంది. దిగువకు అలాప్రయాణంచేస్తూ వెతుక్కుంటూవస్తే సింహాచలంలో వరాహావతారం, నరసింహావతారంకూడా గోచరిస్తూవున్నాయి. ఇంతవఱకూ వివరిస్తే చాల్ననుకొంటాను ప్రకృతమ్మట్టుకు.

ఆ అవతారమూర్తులు రెండూ సింహాచలాన్నే ఆశ్రయించి కనబడ్డమేమూఅంటే, అవిరెండూ ఉగ్రమూర్తులే. అంచేత రెండూకూడా మిక్కిలి చల్లనితావును కోరుకుంటూ సఖ్యంగా వొక్కచోటనే సన్నని సెలయేటిధారలు పన్నీటిజల్లుల్లాపడుతూవుండే ఆకొండను వెలిసినాయి. వెలిసి మూర్తీభవించినాయి.

అసలు వొక్కొక్క అవతారం విడి విడిగా సాక్షాత్కరిస్తేనే పట్టరానిసంతోషంతో పైని ముక్కోటి దేవతలు క్రిందముప్పదికోట్ల మానవులూ పూలవర్షంగురియిస్తూ, దీపారాధనగావిస్తూ, ధూపంవేస్తూ, తమలోతాము హర్షించిపోతారుగదా. అలాంటప్పుడు అవతారద్వయంవెలిసినచోట ఎంతపూజాపురస్కారం జరగనై యుండాలి చెప్పండి! అందులోనూ అవి రెండూ వుగ్రమూర్తులైనప్పుడు వాటికి శాంతి యినుమడింపజేయాలీ అంటే ఏంచెయ్యాలి చెప్పండి!

అదే పుష్యుడం అదే పుష్యుడం అవిగ్రహానికి మంచిగంధం! రాత్రిళ్లు దేవతలుపూసి, పగలు మానవులుపూసి నిక్షేపంగా కాలక్షేపం గావిస్తూవచ్చినారు.

పూలపూజ, కర్పూరనీరాజనారాధన, అగరుధూపసేవ, జరిగినప్పుడు అంతచలించలేదుగాని విగ్రహం గంధంపూత జరిగినప్పుడు మాత్రంచలించింది. పూవులువాడిపోయి గాలికెగిరిపోవడానికి అవకాశంవుంది, దీపారాధన కొంతసేపటికి కాకపోతే కొంతసేపటికైనా పెద్దదవడానికి సావకాశంవుంది. ధూపంతనంతటతానే పైకేమేఘశకలంతోనో ఆడుకోవడానికన్నట్టెగసి పోవడానికవకాశముంది. ఒంటికి పూసినగంధం?అది ఎలా వొదిలిపోవడం? అది ఆరితేమఱింతబిగిసి పోవడమేకాకుండా, పూతమీదపూత, పూతమీదపూత,నఖశిఖపర్యంతం పట్టిస్తూవుంటే, రోమకూపాలుపూడిపోయి.'ఇది పుట్టా? స్వామివిగ్రహమా?' అని అనిపించివేసింది కొన్నాళ్లకు.

అయినాగానీ మానవులుమూర్ఖులు! అంతకన్నామూర్ఖులు దేవతలు!అదేపనిగా చందనం తీసి, ఆ విగ్రహానికి అమేషా రాస్తూవుండడమే తమ వుద్యోగంఅనుకున్నారు. అనుకుని, ఎంతదళసర్నో చెప్పలేనంతదళసర్ని, నిమ్నోన్నతాలు లేకుండా, విగ్రహాన్ని చందన గర్భితం చేసిపారేశారు.

స్వామి కష్టడనిపించింది. "ఏమిరా! యీ మానవులూ దేవతలూకూడా ఇంతమతిపోయిన వాళ్లైనారు? నారూపాన్ని వారి అర్చనలోచూడ లేకపోవడమే మహదాశయంగా పెట్టుకుపనిచేస్తూవున్నట్టు గోచరిస్తున్నారు. వాళ్లకంటె బుద్ధిమంతులు మఱిలేరా? యీభూమ్మీదను" అని కించిన్నిమీలితనేత్రుడై ఆలోచించారు స్వామివారు.

వర్షము గురిసివెలిసిన బహుళామావాస్య

రాత్రిఅది. వైశాఖమాసం ! మూలకానెట్టబడ్డ వెన్నెలకుప్ప అయిందీ, సామివారిచందన స్వరూపంఅయిందీ, తేటపడక ప్రజలూ దేవతలూ అల్లాడిపోతూవున్నారు.

అట్టితరుణంలో మనచక్కని ఆంబోతు అంకెవేసికొంటూ, తనలోంచి పుట్టుకొచ్చిన వుత్సాహంకొద్దీ, స్వామివారినిచేరి తన డెక్కతో అలా అలా రాచి తనకొమ్ముల్తో ఇలా అలా కెక్కరించి, గంధం లోకులకు కాకులకు విరజిమ్మేసింది.

'అదుగో స్వామి! అక్కడున్నాడు! మనం కానకపోయినాం' అని ప్రజలు మూగిపోయినారు. పైని అజరులు తూగిపోయినారు.

"ఆంబోతు"అనడంమానేసేసి 'అంబన్న 'ఆవన్న' 'అప్పన్న' ఇలాగ్గా అనడంమొదలుపెట్టినారు. తమకు దివ్యంగా దేవుని పునర్దర్శనంకలిగించిన ఆనలుగాళ్లదాన్ని తాళాలతో తప్పెట్లతో వూరేగించారు. సింహాదిరప్పన్న సేవలేచేదాము!అది ఆదిగా ఏటేటా స్వామికి అగంధంవొలుపు! ఇదీ ఏతద్వృత్తాంతము.



కీర్తిశేషుడు

జాన్ డేవిసన్ రాక్ ఫెల్లర్

జననము :

8-వ జూలై 1839.

మరణము :

28-వ మే 1937.

దరిద్రుడై పుట్టి కిరసనాయిలు పెట్రోలియము మున్నగునూనెల వర్తకము చేసి లోకమందలి ధనికులలో రెండవస్థానమును దాటలలో మొదటిస్థానమునాక్రమించినవాడు. ఈతని జీవితవివరములకు 1934 ఫిబ్రవరి ఆంధ్రభూమి సంచిక చూడుడు.

# ఆరోగ్యవిజ్ఞానము

మధుమేహరోగులు నిస్సందేహంగాను నిరపాయంగాను పుచ్చుకోతగిన మధురపదార్థం తేనెఒక్కటే.

... ... ...

పసుపు లోనికిసేవిస్తే పిత్తాశయానికి మాంద్యం పోగొట్టి చురుకుతెస్తుంది.

... ... ...

తవుడులో విటమిన్ బి విస్తరించివుంది.

... ... ...

అన్నంతింటో వాగ్వాదం, కోపపడ్డంచేస్తే అన్నం జీర్ణంకాదు.

... ... ...

భోజనశాలలో ఎరుపురంగుల వస్తువులు విస్తారం వుండకూడదు. ఎరుపు ఉద్రేకాన్ని పుట్టిస్తుంది.

... ... ...

ఉద్రేకాన్ని తగ్గించడంలో నీలవర్ణం బహు సమర్థమైంది.

... ... ...

ఊదారంగు తపస్సుకు మంచిది.

... ... ...

ఏకాగ్రచిత్తాన్ని కలిగించడానికి పసుపురంగు ప్రధానమైంది.

... ... ...

శరీరమునందలి విషపదార్థాలని తొలగించడానికి ఫలరసానికి చాలిన మందు మరిఒకటి లేదు.

... ... ...

పాలకంటె కూడ నారింజరసములో ఎక్కువ శరీరపోషకగుణం వుంది.

... ... ...

ఉప్పు నీళ్ళలోకరిగించి ఆనీళ్ళతో పళ్లుతోమితే అవి శుభ్రపడ్డమే కాకుండా చిగుళ్లు గట్టిపడతాయి.

... ... ...

వంటలో ఏపదార్థాన్ని అయినా త్వరలో ఉడికించాలిగాని చాలాసేపు ఉడికించకూడదు.

# లోకజ్ఞానము

ప్రపంచంలో సరఫరా అయ్యే తేయాకులో సగభాగం హిందూదేశంలోనే తయారుఅవుతూ వున్నది.

... ... ...

న్యూయార్కులోని గ్రాండు సెంట్రల్ టెర్మినల్ అనే రయిలుస్టేషన్ ప్రపంచంలోని అన్ని స్టేషన్‌లలోకి పెద్దది. ఆస్టేషన్‌కి 47 ప్లాటుఫారాలు ఉన్నాయి.

... ... ...

వెలుతురు సెకండుకు 186,000 మైళ్లు ప్రయాణం చేస్తుంది.

... ... ...

రేడియో 1902 లో కనుగొనబడింది.

... ... ...

బట్టలుకుట్టే యంత్రాన్ని 1830 లో థిమోన్నీర్ అనే ఫ్రెంచివాడు కనుగొన్నాడు.

... ... ...

అప్పుడుపుట్టిన బిడ్డ సాధారణంగా ఇరవై అంగుళాల పొడుగు, ఏడుపౌనుల బరువూ వుంటుంది.

... ... ...

ఆంగ్లభాషయొక్క నిఘంటువులలో మిక్కిలి పెద్దదైన ఆక్స్ఫర్డు డిక్షనరీలో 5,00,000 పదాలకి అర్థాలు వివరింపబడ్డాయి.

... ... ...

అన్ని ఆకులకు గాలి, వెలుతురు బాగా తగలడం కోసమే చెట్లు తమ కొమ్మల్ని పక్కలకి పెంచుతాయి.

... ... ...

గ్రంథకర్తలు, నటకులు, ఉపాధ్యాయులు, ఇంజనీర్లు, డాక్టర్లు వీళ్లు సాధారణంగా మిక్కిలి పొడుగుగాఉంటారు. ఫ్యాక్టరీకూలీలు, రోడ్డుకూలీలు మిక్కిలి పొట్టిగావుంటారు.

... ... ...

హిందూదేశంలో ఎద్దులుచేసేపని, ఆవులు ఇచ్చే పాలు, రెండూకలిపి ఇచ్చే పెంటఎరువు రూపాయిల్లో విలువకడితే ఏడాదికి 1800 కోట్లు ఉంటుందని అంచనా వేయబడ్డది.



# మొదటిసారి

రచయిత:

పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి

అవి ఎండాకాలపు శెలవలు. ఆ మిట్టమధ్యాన్నమప్పుడు మాకిద్దరికీ (అంటే రాముడుబావకూ నాకూ) ఎండ అనిపించడం వల్ల ఇంటిపట్టున వుండాలిసి వచ్చింది—కాక మాది పల్లెటూరు. మానాన్నగారు గూడా వూళ్లో లేకపోవటంచేత చీట్లపేక ఒకటి సంపాదించి దాంతో తీర్చుకుంటున్నాం మా పరీక్షల బడలిక అంతా.

ఆ సావిట్లోనే మొత్తనానుకుని మా అత్తయ్యా, ఆమె కెదురుగా మా అమ్మా కూర్చుని తెంపు లేకుండా రాచకార్యం చేస్తున్నారు. మధ్య మధ్య మా అత్తయ్య వత్తులు చేస్తూంది. మా అమ్మ పీటపెట్టుకు బియ్యములో రాళ్లు చేస్తూంది.

చీట్లాటలో రాముడికీ నాకూ తగాదా వచ్చింది. తప్పు వాడిదే. ముక్క చెయి జారి పడ్డది; ప్రమాణపూర్తిగా నేను దిగాలని దిగలేదంటాను. వాడది నమ్మక అరవటం మొదలు పెట్టాడు.

'ఏమిట్రా—అగోలా? మాట తోచకో నివ్వకుండా గల్లంతు చేస్తున్నారు?—పాడు చీట్లపేకా మీరునూ!—అడుగో మామయ్య వస్తున్నాడు లే—మీ పని చెపుతా వుండండి!' అని కోపంచేసింది మా అత్తయ్య.

చెప్పుల చప్పుడు గూడా వినపడింది. నేను వంగి వీధిగుమ్మంవైపు చూచాను.

'నిజంగానే వస్తున్నాడ్రా!—చీట్లు చాప కిందకి తొయ్యరా చప్పున' అన్నాను ఆదుర్దాతో.

ఆయన్ను చూస్తే మాకు హడలు. మా కేకాదు మా అమ్మకూ—మా అత్తయ్యకూ—మా వూళ్ళోవాళ్ళకూ చివరకు మా జిల్లాలో వాళ్ళందరికీ కూడా ఆయనంటే భయమే.

మీది కృష్ణా జిల్లా అయితే శీతారామయ్యగారి పేరు విని వుండక తప్పదు. ఆయన లేనివ్యాజ్యం ఆ కోర్టుల్లో వుండదు. మా చుట్టుపక్కల వూళ్ళవాళ్ళందరికీ ఆయన్ను చూస్తే భయమూ, కోపమూ. అట్లాఅని ఆయన దగ్గరకు రాక ఎంతవాడికీ తప్పదు.

ఆయన స్వచ్ఛమయిన బ్రాహ్మణ్యం జరువుతూ వుడటం వల్ల కూడా కొంత గౌరవము సంపాదించాడు లోకంలో. ఇంట్లో వుంటే దేవతార్చనా, బ్రహ్మయజ్ఞమూ, పితృతర్పణా వగైరా రెండుగంటలు చేసేవాడు. వాయిదాలకు బస్తీకి పోతే ఏంచేసేవాడో తెలియదు. బహుశా మనస్సు రాయి చేసుకుని పూటకూళ్ల ఇంటోనే తినేవాడు అనుకుంటాను.

ఆయన వైద్యం గూడా కొద్దిగా చేసేవాడు. ఎప్పుడో పూర్వము ఎవరెవరికో తను మందులు ఇచ్చినట్లూ, వాళ్ళంతా బతికినట్లూ చెప్పేవాడు. కొంతమంది ఆయన మాటలు

నమ్మి ఆయనయిచ్చిన మాత్రలు పుచ్చుకునే వాళ్లు. వైద్యానికని ప్రత్యేకం డబ్బు పుచ్చుకునేవాడు కాదు. కాని అన్నిటి వారా ఏ వ్యాజ్యంలోనో తీసేవాడు.

కొందరు బయట అధికారం చలాయిస్తూ, ఇంట్లోకిరాగానే పిల్లికూనల్లాగా అయిపోతారు. కాని మాతండ్రి ఆ తరగతివాడు కాదు. అందుకు కారణం మా అమ్మ ఏమో నాకు తెలియదు. మాఅత్తయ్యా రాముడూ పెద్ద ఆస్తిపరులయినప్పటికీ, రాముడికి తండ్రి పోవటంచేత వాడి ఆస్తి మానాన్నే మానేజీ చేస్తున్నప్పటికీ, వాళ్ళకుకూడా ధారాగతాలు లేవు ఆయనకు ఎదురు చెప్పటానికి.

మాతండ్రి గొప్ప తెలివిగలవాడనీ గొప్ప చదువులేక పోయినప్పటికీ, పెద్ద ప్రయోజకుడనీ, ఆయన్ను చూస్తే, నా మటుకు నాకు, భయమేకాక, భక్తిగూడా వుంటూవుండేది.

అందు కనే ఆయన వస్తున్నా డని మా అత్తయ్య అనగానే చీట్లను చాపకిందకు వెంటనే తోసి. చేతికందిన పుస్తకాలను చెరొకటి తీసుకొని చదువుతున్నట్టు నటిస్తూ కూర్చున్నాము.

ఆయన వచ్చి, మమ్మ సందరినీ ఒకసారి తేరిపారచూచాడు. చెప్పులు విడుస్తూనే చెప్పాడు : రెండువేల కట్నంతో రాముడికి మూర్తివారి సంబంధం కుదుర్చుకు వచ్చాననీ, రేపు దశమి నాటికి లగ్నమనీ, మా అందరికీ —అంటే రాముడికీ, నాకూ, మా అత్తయ్యకూ, మా అమ్మకూ—వినపడేటట్టుగా —ఏ ఒకళ్ళతోనో చెప్పినట్టుగా కాక— ఒకసభలో వుపన్యాసం ఇచ్చే ధోరణిలో— పెద్ద గొంతుతో చెప్పాడు. మాలో ఎవళ్ళన్నా 'ఇట్లా చేసావేం?' అని పొరపాటున అంటే విరుచుకు మీదపడేటట్టు చూచాడు.

ఆయన ఆముక్క అన్నప్పటినుంచీ, లగ్నం వరకూ మాలో మాకు జరిగిన సందర్భాలు —అంటే రాముడు నా ప్రోత్సాహంతో, వాళ్ళమ్మ దగ్గరకు వెళ్ళి—చిన్నతనంలో, చదువు పూర్తికాకమునుపు—అందుట్లో కట్నాలు గిట్నాలు తీసుకొని—పెళ్ళి చేసుకోటం అనేది తన వ్యక్తిత్వ ఆశయా లన్నిటికీ భంగకరమని అర్థంవచ్చేమాటలు కొన్ని గొణగటం,—వాళ్ళమ్మ 'నోరుమూసుకోరా, నాయనా!—మామయ్య వినిపోతాడు!' అని ఒకే సమాధానం ఎన్నిసార్లయినా చెప్పటం; —చివరకు రహస్యంగా చొక్కా లని పేరు పెట్టి, నూరు రూపాయలు మా అత్తయ్య మాకు ఇవ్వటం;—చొక్కాలు, చుట్టాలు పెళ్ళికొడుకును చెయ్యటం సరదాలోపడి, రాముడు తన వ్యక్తిత్వ ఆశయాలన్నీ మరిచి పోవటం—ఇవన్నీ ప్రస్తుతం అనవసరమయిన డిటెయిల్సు.

పది పన్నెండేళ్ళ క్రితం—ఆ రోజులు వేరు —ఆ పెళ్లిళ్లు వేరు—ఆ సరదాలు వేరు. ఇప్పుడు ఈ పెళ్లిళ్లు—ఏం పెళ్లిళ్లు!—ముఖ్యంగా ఓ ముగ్గురో ఏనైజామో వెళ్ళటం —రెండు పూటలు గడిపి రావటం—పెళ్లి అయిందని పుకారువెయ్యటం!—శారదా బిల్లు!—పాడు శారదా బిల్లు!—

పెళ్లివారి 'భళ్ల'ల్లో ఎక్కి తర్లిపోవటం బహు సరదాగా వుండేది. 'తర్లి పోవటం' అంటే—మజిలీలూ—భోజనాలూ—బోల్తాలూ—చద్దివణ్ణాలూ—మన ప్రాప్తాన్నిబట్టి, దొంగలూ—మధ్య మధ్య కొంచెం కొంచెంగా ప్రయాణంగూడా వుంటుంది.

ఎందుకో 'భళ్ళ'న్నీ చీకట్లో అమాంతంగా ఆగుతేయి.

'ఎందుకురా, ఆపారు!—సాగి పోనియ్యం

డి!—' అని అరుస్తావు చివర బండిలోంచి. జవాబు వుండదు. బోల్తాగావచ్చు, దొంగలు కావచ్చు, ఇంకా ప్రమాదమయింది ఏదైనా కావచ్చు. కర్రా లాంతరూ తీసుకొని, బండి దిగి, విచారణకు పోతావు. కారణం కన పడదు.

అనవసరంగా ఆపినందుకు ముందు బండి వాణ్ణి కేకలేస్తావు. వాడికి కోపంవస్తుంది.

'యాండండీ?—కిష్టయ్యగోరూ?—మీారు ఎప్పుడూ ఇంతేనండీ!—లోకువగా వున్నాం గదా అని మా మీాదండీ మీాకూకలూ; (బండిలో వాళ్ళకేసి తిరిగి) 'యామండీ!' శేసమ్మగారూ!—మీారు సెప్పండీ!—'అపశ!—అపశ!'అని కేక లెట్ట లేదండీ,ఓరో?' అని అంటాడు.

'అవునురా, అబ్బాయీ!—అట్లాగే విన పడ్డాయిరా మాక్కూడా—' అని ఆవిడ గారు సాక్ష్యమివ్వటం—అప్పటికి అరగంట అవుతుంది. తీరా లగ్నం మించిపోతుందేమో నని బతిమాలి బళ్లు సాగతీస్తావు.

ఇంతకూ చెప్పొచ్చిందేమిటంటే—ఇట్లాంటి అవస్తలు ఆటే పడకుండానే 'భళ్ళ' కట్టుకుని లగ్నంనాటి పొద్దుటికల్లా చేరుకున్నాం రాముడి అత్తవారి వూరు.

చిన్న పందిరివేసి తోరణాలు కట్టబడిన డాబా ముందు బళ్లు ఆగినయి. అంతా దిగండి ఇదే పెళ్ళివారివిడిది అన్నారుఎవరో.

బళ్ళవాళ్ళు పెట్టెలుదింపి, ముందు సావిట్లో మూలగా పెడుతున్నారు. ఆడవాళ్లతో, పిల్లలతో, బళ్లవాళ్లతో పెద్ద గల్లంతుగా వుంది.

ఇంతలో మా నాన్నగారి పెద్ద గొంతు వినపడ్డది. 'ఒరే సుబ్బన్నా!—ఆ పెట్టె అక్కడకాదురా వేరే వుంచాలిరా!' అని, నన్ను పిలిచి తను వరపూజకు తొందరచెయ్యటానికి వెళ్తున్నాననీ, ఆ పెట్టెను పక్కగదిలో భద్రపర్చమనీ చెప్పి పోయినాడు.

నేను దానిని పట్టుకొని లోనికి పోయినా. మెల్లాకు రెండువైపులా గదులున్నాయి. ఏదో తెలియక ఒకగదిలో ప్రవేశించాను.

'ఎవరది?' అని సన్నని చక్కని గొంతు వినపడ్డది.

ఒక నిమిషంపాటు బిత్తరపోయి చూచాను. ఆమెకు 20 సంవత్సరములు వుంటాయి. ఆమె అద్దంలోచూచుకొని దువ్వుకుంటూంది. నొక్కులు నొక్కులుగా వున్నజుట్టు మరి కాసిని నొక్కులు పడుతున్నది. ఆమెకళ్లు నాకు ఇప్పటికికూడా మరుపురాకుండా వున్నయి. అంతవరకూ ఆడవాళ్ళూఅంటే ఎవరో అన్నట్టుగా వుండే నాకు ఒక్కసారిగా హృదయం పొంగిపోయింది. ఆమెను అట్లా చూస్తూ ఏళ్ల తరబడి అన్నం నీళ్ళూ లేకుండా నిల్చోగలననిపించింది.

'ఎవరండీ?' అన్నది మళ్ళీ, నా వంక చూస్తూ.

'పెళ్ళివారం' అన్నాను నా సహజమయిన బర్రెగొంతుకు సిగ్గుపడుతూ.

'అయితే?'

'మానాన్నగారు ఈపెట్టె ఏదోగదిలో పెట్టమన్నారు.'

'ఎవరు? శీతారామయ్యగారా? మీాతండ్రీగారా?' ఆమెకళ్ళలో కొంచెం ఆశ్చర్యం కనిపించింది.

'ఈగది కాదు. ఆఎదురుగావున్న గది ఖాళీచేశాం మీాకోసం. అందులో పెట్టండి' అంది. ఆమె గొంతకలోకి ఒక విధమయిన మార్పు వచ్చింది. అప్పటినుంచీ నాతో చిర పరిచయం గలదిలాగా, ఎంతో చనువుగా,

మాట్లాడటం మొదలుపెట్టింది.

నేను పెట్టెతీసుకుని ఎదురుగావున్న గది లోకిపోయినా. దానిని కిందపెట్టి, మళ్ళీ ఆమె గదిలోకి ఏ మిషకల్పించుకుని పోదామా అని ఆలోచిస్తూ కూర్చున్నా పెట్టెమీద.

ఇంతలో ఆమె తాళంఒకటి తీసుకొని నా గదిలోకి వచ్చింది. 'తాళం మీరు తెచ్చుకు న్నారో లేదో అని ఒకటి వెతికి పట్టు కొచ్చాను. ఈ అయిదురోజులూ దీనినిమీరు వాడుకోండి' అన్నది.

నాకు మాట్లాడటానికి ఏమీ తోచలేదు. ఆకర్షిస్తూన్న ఆమె పెద్ద కళ్లల్లోకి చూస్తూ కూర్చున్నా. ఆమె అందిస్తూన్న తాళాన్ని అందుకున్నా.

ఆమె ఒక్కనిమిషం ఆగి కొంటెతనంగా నావంక చూస్తూ 'మీకు ఇంకా ఏమయినా కావాలా?' అన్నది.

ఏమి కావలెనని చెప్పను? మాట్లాడేశక్తి అంతా ఒక్కసారిగా పోయినట్టుగా చూస్తూ కూర్చున్నా.

ఆమె గదివిడిచి పోవటానికి సిద్ధమయింది. పోతూ మళ్ళీ వెనక్కుతిరిగి, ఆ అందమయిన చూపులు నామీదవిసిరి 'ఒకవేళ యేదయినా కావలిస్తే నన్నుఅడగండి, నేను ఇక్కడే వుం టాను.' అని వెళ్ళిపోయింది.

దేవలోకంనుంచి ఒక్కసారిగా మామూ లు ప్రపంచంలో పడ్డట్లయింది.

'పోయెనయ్యో ఇపుడు ననుబాసి...' అనే కీర్తన జ్ఞాపకంవచ్చింది. మనగొప్ప యాక్టరు ఒకాయన స్టేజిమీద ఒక వింగునుంచి ఇంకో వింగువరకూ గంతులేసి ఆక్టుచేసినట్టుగా చె య్యలేదు కాని జ్ఞాపకం వచ్చినంతమట్టుకూ ఆచరణాలు అనకుండా వూరుకోలేకపోయినా.

మొదటిరోజునే ఆమెపేరు కనుక్కున్నా. ఆమెపేరు లక్ష్మి. ఆమె ఇంటిఆవిడ కూతురు. తల్లీ కూతురూ తప్ప ఇంట్లో ఎవరూవున్నట్లు కనిపించలేదు. లక్ష్మిమొగుడు ఎక్కడ వున్నా డో తెలియదు. ఏదేశాంతరాల్లోనో చదువు తున్నాడేమో. వివరాలు బాగా చెప్పేవాళ్లు కనిపించలేదు.

ఆమెకు నాకంటే మహావుంటే ఒకఏడాది వుండొచ్చు, కాని ఆమెతో మాట్లాడుతున్న ప్పుడు నాకంటె ఎంతోపెద్దది అనిపించేది.

మొదట్లో ఆమెతో మాట్లాడటం బెరుగ్గా వుండేది. కాని రానురాను ఆమె పూతంవల్ల నేనుగూడా చాలాచనువుగా మాట్లాడటం నేర్చుకున్నాను.

లక్ష్మి నేనూ రోజుకు వందసార్లయినా కలుసుకునేవాళ్ళం పళ్ళుతోమేటప్పుడూ— ఊరేగించేటప్పుడూ—పాటలు పాడేటప్పుడూ —పేర్లు చెప్పేటప్పుడూ—మేజువాణీ చేసే టప్పుడూ—ఫలహారాలు చేసేటప్పుడూ— ప్రమాదము లేకుండా ఆమెకు ఎంతదగ్గరలో వుండకలిగితే అంత దగ్గరగా వుండేవాణ్ణి. ఆమె పూట కొకవిధంగా సింగారించుకుని వచ్చేది. అప్పుడప్పుడు నామీద ఓరచూపులు విసురుతూ ఉండేది. ఆరోజుల్లో వాటితోనే జీవిస్తూ వుండేవాణ్ణి.

పేర్లు చెప్పాలసివచ్చినప్పుడు నేను ఆడ వాళ్ళలోకి చొరవచేసుకొని వెళ్లి, 'ఇవ్వాళ్ల నువ్వు ముందుచెప్పాలిరా పెళ్లాంపేరు రాము డూ' అనేవాణ్ణి. అట్లాంటప్పుడు లక్ష్మి నా పక్కనే వుండటం తటస్తించి, పెళ్లికొడుక్కు వత్తాసుగావచ్చి, 'అమ్మా!—అల్లా కాదండీ —మీ అమ్మాయే ముందుగా చెప్పాలి' అనేది. అది పెద్ద హంశంలాగా వాగ్వివాదం పడేవాళ్లం. చివరకు 'ముందు మీరు చెప్ప కండి' అని ఆమెఅంటే—'ముందు నీవు

అసలు చెప్పకమ్మ' అని నేను పెళ్లికూతుర్ని హెచ్చరించేవాణ్ణి. అందరూ తలొక మాటా అనేవాళ్లు. చివరకు ఎవరో ముందుచెప్పే వాళ్లు. రాముడు పెళ్లాంపేరు చెప్పగానే నాకు వినబడలేదు, మళ్ళీ చెప్పమనేవాణ్ణి. పెళ్లికూతురు పేరు చెప్పినప్పుడు లక్ష్మిగూడా అంతే చేసింది. చివరకు గంటసేపటికి పేర్లుచెప్పటం తంతు పూర్తి అయ్యేది.

అప్పుడప్పుడు ఒంటరిగా కూడా మేం కలుసుకునేవాళ్లం. నేను గదిలోకి పోయినప్పుడు, ఆగదిదగ్గరకే ఆమెగూడా వచ్చేది యేదోపని వున్నట్టుగా. వీలుగావుంటే పలుకరించేది. నేను గూడా యేదో అవుసరంలేని ప్రశ్నలేస్తూ వుండేవాణ్ణి 'యేమిటి? మళ్లు కట్టుకొని భోజనాలకు పోతూంటే మీరుఇక్కడేవున్నారేం?' అనో— లేకపోతే 'వూరేగింపుకు రారా?' అనో అనేవాణ్ణి.

అయితే మొదటిరోజునుంచీ మేం ఇద్దరం ఎంతమందిలో వున్నా, యేం మాట్లాడుతున్నా, యేం మాట్లాడకపోయినా, మా ఇద్దరిమధ్యా లోకానికి తెలియని ఒక రహస్యం వున్నట్లు, మా చూపులలో ఒకఅర్థంవున్నట్లు వుండేది. మేము సంబంధంలేని అనవసరమైన హాంశములను గురించి మాట్లాడుతున్నప్పటికీ నాహృదయభావమును ఆమె అర్థంచేసుకున్నట్లు ఆమె నావంక చూచేది.

మూడోరోజు మధ్యాన్నము గామాల్ను నేను ధైర్యంచేసి, ఆమెగదిలో ఒంటరిగా వుంటే కనిపెట్టి గదిలో ప్రవేశించాను. ఆమె 'యేమిటిక' అన్నట్టుగా చూచింది.

అక్కడ హార్మోనియం ఒకటి కనిపించింది. వెంటనే ఒక మెట్ల కనిపెట్టాను. నాకు ఏమీ తోచనట్టూ, ఆమె నడిగి వాయించుకుందా మని వచ్చినట్టూ నటించాను. ఆమె నేను పెట్టిన మెట్లకు తృప్తిపడ్డట్టు కనిపించింది, గాని ఇంతలో మానాన్నగొంతు వచ్చి మా సంభాషణ పూర్తిగా చెడగొట్టింది.

'వాసే!— ఎక్కడరా?—అబ్బాయీ!' అని తన పెద్ద గొంతుతో కేకలు పెట్టాడు. నేను ఆమె గది లోంచి వచ్చాను భయపడుతూ.

'ఏం చేస్తున్నావురా, ఇక్కడ?'

హార్మోనియం అంటే పట్టిస్తుందేమోనని 'తెల్లకాగితంకావలసి ఇంటి వారిని అడుగుతున్నా' అని అబద్ధం ఆడాను. లక్ష్మి నామాటలు వింటూ గూడా వూరుకుంది.

'సరే గాని, నీవు వెంటనే సైకిలు వేసుకుని పేటకు వెళ్లి, 2,000 మల్లె పూలు కొనుక్కురావాలి— చూస్తావేం ఇంకా?— పోక!' అన్నాడు. ఎట్లాగో బయట పడ్డాం గదా అని సంతోషించి లక్ష్మివంక చూడకుండా సైకిలు ఎక్కి పోయినా.

నేను తిరిగి ఇంటికి వచ్చే టప్పటికి గంట అయింది. పూలబుట్ట మా అమ్మ చేతి కిచ్చాను. లక్ష్మిక్కడే అవుంటే ఆమెను ఒక సారి సూచనగా చూచి వచ్చాను. మెల్లాలో పని వున్న వాడి లాగా తారట్లాడుతున్నా ఆమె కొరకు.

నాచూపును అర్థంచేసుకొని తప్పక వస్తుందని నాధైర్యం. కాని ఆమె అర్థంచేసుకోలేదేమోనని భయం. అయితే రెండుమూడు నిమిషాల్లోనే నన్ను అర్థంచేసుకున్నట్టుగానే లోపలికివచ్చి, పనివున్నదానిలాగా తనగదిలోకి వెళ్ళింది, వెంటనే నేనుకూడా వెళ్ళాను వెనకాముందూ ఆలోచించకుండా.

వెనక్కుతిరిగి నావంక చూచింది 'ఎందుకు?' అన్నట్టుగా.

జేబులోంచి, మధ్య గులాబి పువ్వూ,

చుట్టూ మల్లెపూలతోనూ చెమికీతోనూ అమర్చబడినటువంటి ఒక చెండును బయటకు తీసాను.

'ఇదిగో' అన్నాను.

'ఎక్కడిది?'

'నీకోసరమని నేను కొన్నాను,'

'నాకెందుకు?'

'నీవు తల్లో పెట్టుకుంటే బాగుంటుంది.'

'చాల్లెండి—మీమాటలు.'

'చాల్లెండి లేదు—ఏం లేదు—నీవు అలా మాట్లాడకు—నీకోసమని నేను కష్టపడి తీసుకొస్తే!' అని, ఆమె చేతిని పట్టుకుని, అరచెయ్యి తెరచి, ఆ చేతిలో చెండును వుంచాను. ఆమె ఎదురుమాటాడక నావంక చూస్తూ నిల్చుంది.

అక్కడితో నాధైర్యంఖర్చయిపోయింది. ఎందుకనో ఆమెవంక కన్నెత్తి చూడలేకపోయినా, పెద్ద తప్పుచేసినవాడిలాగా. అప్పుడు మానాన్న నన్ను చూచివుంటే చంపేస్తాడని తోచింది. అంతట ఆ గదిలోంచి వెనక్కు ఒక్కపరుగు తీశాను.

ఎవరికీ కనపడకుండా తిరిగాను గంటా గంటన్నర. నేను ఇట్లాచేశానని లక్ష్మి మా అమ్మతో చెపుతుందనీ, మాఅమ్మ మా నాన్నతోనూ, ఇతరులతోనూ చెపుతుందనీ భయంవేసింది. చివరకు ధైర్యంచేసి సాయంత్రానికి పెళ్ళివారింటికి వెళ్లాను. అక్కడ మేజువాణీ జరుగుతూంది. నన్ను ఎవరూ వింతగా చూడలేదు—మా నాన్నగాని, మా అమ్మగాని, లక్ష్మికూడా అక్కడేవుంది. నాకొరకేగామాల్ను అటూఇటూ చూస్తూంది. నేను ఇచ్చిన చెండు జెడలో పెట్టుకుంది. నన్ను చూచి చిరునవ్వుగూడా నవ్వింది. అప్పటికి ధైర్యం వచ్చింది. నేను అనవసరంగా భయపడ్డానని తెలుసుకున్నా.

మర్నాడు. నాలో ఒకవిధమయిన ఉద్రేకమూ, ఉత్సాహమూ పుట్టింది. ఎనిమిదింటి నుంచీ గది దగ్గర ఏదో పనివున్నవాడిలాగా నటిస్తూ కాపలాకాస్తూ కూర్చున్నా. లక్ష్మి ఒంటరిగా గదిలోచిక్కిందంటే పట్టుకుని హృదయం విప్పి చెప్పుదామని నాప్రయత్నం. ఆమె చాలాసార్లు ఆదారిన నడిచింది, నన్ను ఓరగా చూచింది, కాని నాకు సావకాశ మివ్వలేదు. ఒంటరిగా గదిలో కాలుపెట్టలేదు.

కాని నేను నిరుత్సాహుణ్ణి కాలేదు. భోజనాలకుముందు ఆమె గదిలోకి రావలసిన అవసరం కలిగినప్పుడు, నేను ఇంకా అక్కడే వుండటంచూచి ఏదో ఒకపిల్లను వెంట తోడుగా తెచ్చుకుని గదిలో కావలసిన వస్తువు తీసుకుని వెళ్లిపోయింది. అప్పుడు నాకు నిరుత్సాహంకల్గింది. ఆమె నన్ను స్పష్టంగా ఎడం చేస్తూందని తెలుసుకున్నా. నాకు కారణం తెలియలేదు. ఏడుపుకూడా వచ్చింది.

కాని మధ్యాన్నం పూర్తిగా నిరాశ చెందక వేరుపంథా తొక్కాను. అక్కడే గొంతు మీద కూర్చున్నట్టు కాకుండా వీధిలోకి వెళ్ళి కనపడకుండా లక్ష్మి జాడలు కనిపెడుతూ నిల్చున్నా. ఆమె నేను లేనుగదాఅని నమ్మి గదిలోకి వెళ్ళినప్పుడు పోయి, దొంగను పట్టుకున్నట్టు పట్టుకుందామని ప్లానువేశా.

ప్లాను పారింది. మూడుగంటల షుమారుకు లక్ష్మి నిశ్చింతగా గదిలోకి వెళ్ళింది ఒంటరిగా. నేను వెంటనే ఇంట్లోకి మెల్లాలోకి, జొరపడ్డాను. అక్కడ అదృష్టవశాత్తూ ఎవరూ లేరు. గదిలోపటుకు ఆమె అలికిడి వినపడుతూంది.

సరాసరి గదిలో ప్రవేశించి, ఆమెకు మా

ట్లాడటానికి ఒక్కనిమిషంకూడా సావకాశం ఇవ్వక, రెండుచేతులూ పట్టుకుని దగ్గరకు లాక్కుని, రెండు బుగ్గలమీదా రెండు వేడి ముద్దులు పెట్టాను.

‘తప్పు—వూరుకో—ఎవరన్నా వస్తారు—నన్ను వదులు—’ అన్నది మెల్లిగా అర్ధస్తాయిలో.

‘వూరుకోను—పొద్దుటినుంచీ నన్ను—ఎట్లా ఏడిపించావు?’

‘ఏం?’

‘నేను నీకోసం—వేచు కున్నా నని నీకు తెలుసుగా?’

‘నేను ఒంటరిగా చిక్కితే, ఇట్లాంటిపని చేస్తావనికూడా నాకు తెలుసు.’

‘మరి నే నెట్లా వూరుకోను?’

‘ఇప్పుడు కాదు—ఎవరో వస్తున్నారు—రాత్రికి—’

‘ఒక్క ముద్దు—’

‘కాదు—రాత్రికి — రాత్రికి—’ అని నన్ను తప్పించుకుని పారిపోయింది.

ఆ సాయంత్రమంతా కాలచక్రం తిరుగుతూన్నట్టు నాకు కనిపించలేదు. నాకాళ్లు భూమిమీద నడుస్తున్నట్టుగా లేదు. రాత్రి సంగతి ఆలోచనలోకివచ్చి, గుండె గబగబా కొట్టుకొంటూంది. మా నాన్నను చూచినప్పుడల్లా, నాఉద్రేకమునూ, నాపరధ్యాన్నమునూ కనిపెట్టి అనుమానపడతాడేమోనని భయము. అందుకని సాధ్యమైనంతవరకూ మా నాన్నను తొలిగి వుంటున్నా.

ఒక్కసారి ఆయన నన్ను పట్టేసి ‘ఏమిట్రా, అబ్బాయీ?—వైభవంగా పెళ్లి అవుతూంటే నీజాడ ఎక్కడా కనపడదు?—పొద్దూకులూ ఏం చేస్తూంటావో!— చేతికి అక్కరకొచ్చిన వాడవు ఒక్కపని సంబాడించుకోలేవు?—ఇంకా ఎన్నాళ్ళకురా మీకు జ్ఞానంవచ్చేది?’ అని నాలుగూ జాడించాడు. మాటాడ లేక పిల్లిలాగా జారుకున్నా.

రాత్రికోరకు ఎంత వుత్సాహపడుతున్నానో, అంత భయంగూడా పడుతున్నా. ఎంత రహస్యంగాచేసినా, మానాన్నకు తెలియకుండా ఏపనీ నేను చేయలేనని నా కొక భయము. నా ప్లాను లన్నిటికీ ఆయిన సైంధవుడు లాగా అడ్డుపడి, నన్ను పట్టేస్తాడని నా కొక పెద్ద అనుమానము. కాని యముడంత వాడికి భయపడి కూడా లక్ష్మిని వదలలేను. ఏ అవాంతరం వచ్చిపడ్డా సరే రాత్రి కొరకు నిరీక్షిస్తున్నా.

లక్ష్మి మీద ఒకకన్ను వేసి వుంచాను సాయంత్రమంతాను. ఆమె తనకు ఏమీ జరగనట్టు మామూలుగా మేజువాణీల్లో, పాటల్లో, ఊరేగింపుల్లో మునిగి తేలుతూంది. నావంక నన్నా చూడటం మానేసింది. కాని ఆమె మనస్సులో నన్నుగురించే ఆలోచిస్తున్నదని నాకు తెలుసును. మాగ్రంథం చాలాదూరం పోయిందని ఆమె పస్తాయిస్తున్న దేమోనని నాకు అప్పుడప్పుడు అనుమానం కలిగేది. ఆమె పవిత్రతను మలినంచెయ్యటం నాకు భావ్యమయినపనా అనిగూడా ఆలోచించాను; కాని ఆమె సాన్నిధ్యం కోరకుండా వూరుకోలేకపోయినా. రాత్రి ఎప్పుడు వస్తుందాఅని కనిపెట్టుకు కూర్చున్నా.

రాత్రి భోజనాలు అయ్యేటప్పటికి పొద్దుపోయింది. ఎదురుకోల అయ్యేటప్పటికి 12 అయింది.

లక్ష్మి రాత్రిళ్లు పడుకోటం ఆ గదిలోనే.

నేను రహస్యంగా గదిలోకి రావటానికి సావకాశం ఇస్తుందని నానమ్మకము. తొందరపడకుండా చుట్టుపక్కల తారట్లాడుతున్నా.

మా నాన్న ఎదురుకోల అయింతరువాత కనిపించలేదు. ఇదికూడా శుభసూచకంగానే వుంది అనుకున్నా.

ఒక్కొక్కరే ఏదో ఒక చాపో, జంపకానో చూచుకుని సవిట్లోనో పంచలోనే పడుకుంటున్నారు.

లక్ష్మి పడుకునేప్రయత్నం లేకుండా ఏదో రాచకార్యం చేస్తూనేవుంది చివరకు కొంతసేపటికి లేచి లోపలికివెళ్ళింది—తనగదిలోకి. వెంటనే కాక కొంచమాగి, ఎవరూ చూడకుండా గదిలోకి పోదామని నా ఆలోచన. ఆమె నాకొరకు తప్పక తలుపుతీసి వుంచుతుందని నా ఆశ.

అరగంట ఆగి మెల్లి గా మెల్లాలోకి వెళ్లాను. గదివాకిట్లో చాపవేసుకుని ఎవరో పడుకున్నారు. నిదానించి చూచాను. ఆమె లక్ష్మి తల్లి. ఆమె నా అలికిడి కనిపెట్టి 'ఎవరు వారు!' అంది. 'నేను' అన్నాను. దేనికొరకో వెతుకుతూన్నట్టు నటించి, గది తలుపు లోపల వేసివున్నట్టు గ్రహించుకుని ఇవతలకు వచ్చాను.

నాకు ఒక విధమయిన నిరాశవచ్చింది. లక్ష్మితల్లి రాక్షసిలాగా ప్రత్యేకం నా కొరకే నియమింపబడ్డట్టుగా ఆ తలుపును కాపాడుతూంది. లక్ష్మి లోపల తప్పక వుందని నాకు తెలుసును. నిస్పృహతో ఒక చాప వుంటే దానిమీద పడుకున్నా. కళ్ళవెంట నీళ్ళుకూడా వచ్చినయి.

కొంతసేపటికి ఒక వూహ తట్టింది. ఆ గదికి రెండోతలుపు దక్షిణవైపు చిన్న దొడ్డోకివుంది. ఆదొడ్డో ప్రవేశించానంటే తలుపుగుండా లక్ష్మిని మెల్లిగా పిలిచి గదిలో ప్రవేశించ వచ్చునని తోచింది.

ఈవూహపుట్టిన తర్వాత ఒక్క నిమిషం పడుకోలేదు. దక్షిణవైపు దొడ్డివాకిలి దగ్గరకు వెళ్లాను. నేను అనుకొన్నట్టుగానే తలుపు లోపల గడియవేసివుంది. గోడదూకు తేనే గాని దొడ్లో ప్రవేశించలేను.

గోడదూకటం నాకు అంత కష్టంగా కనిపించలేదు. కాని, ఎవరన్నాచూస్తే దొంగలని వెంటపడతా రేమోనని భయంవేసింది. అందుకని నాలుగుపక్కలా పరీక్షించిచూచి, చూపుమేరలో ఎవరూలేరని రూఢిచేసుకుని, ఒక వూపుతో గోడఎక్కి అవతలకు దూకాను, చప్పుడులేకుండా.

గదిలో లాంతరు వెలుగుతూంది. తలుపు భార్లగా తీసివుంది నాకొరకేనని అనుకున్నా. అయినా ఎందుకయినా మంచిదని, వెన్నెలలో గోడనీడవుంటే ఆనీడలో నక్కి గది దగ్గరకు వెళ్లాను. లక్ష్మి మంచంమీద కూర్చుని తనలో తాను నవ్వుకుంటున్నట్లు కిటికీలోంచి కనిపించింది. ఇక ఆగలేక 'లక్ష్మీ' అని అంటూ గదిలో ప్రవేశించాను.

నాపిలుపు వినగానే లక్ష్మి గాభరా పడుతూ లేచి నిల్చుంది. ఆ తొందరలో రెండు నోట్లేవో ఆమె చేతిలోంచి జారి కిందపడ్డయి ఆక్షణంలోనే మంచంమీద ఎవరో లేచి కూర్చుంటున్నారు. అది ఎవరో కాదు మా తండ్రి శీతారామయ్య!

నేను స్తబ్ధుణ్ని అయిపోయినా. నోట మాటరాలేదు.

ఆయన లేచి కూర్చున్నతర్వాత గాని నన్ను చూడలేదు. నన్ను ఓరగాచూచి

గుర్తుపట్టి తత్క్షణమే నాకు మొహం కనపడకుండా దుప్పటి ముసుకు వేసుకున్నాడు. మందమతి అయిన నేను ఆయన్ను చూడలేదనీ, అథవా చూచినా గుర్తుపట్టి వుండ వనీ ఆయన ఆశపడ్డాడు గామాల్ను. ఆయ నంటే వుండే గౌరవమూ, భయమూ ఒక్క సారిగా పోయినయి. ముసుకు వేసుకుంటే మటుకు ఈ పిరికిపంద నన్నెట్లా తప్పించుకు పోగలడు అనుకున్నా.

ఆ ముసుగుతోనే మెల్లిగా లేచి, గోడవైపు మొహంపెట్టి ఎండ్రకాయలాగా వాకిలి దాకా నడిచి, దొడ్డోకిదాకి కనపడకుండా పారిపోయినాడు.

ఇంతలో లక్ష్మి 'ఏమిటి-ఇట్లా ఎందుకు వచ్చావు?' అన్నది.

'నీవు ఇంతదానివి అని తెలియక' అన్నాను కోపంతో.

అంతే, ఇక అక్కడ ఒకక్షణంగూడా వుండ లేదు. గది తలుపు తీసుకొని మెల్లాలోకి వచ్చాను.

తలుపు చప్పుడు కాగానే పడుకున్న ముసలిది మేలుకొని 'ఎవరు వారు' అంది మళ్లా.

'నీవు ఇక్కడ కాపలా కూడానా?' అని నా కసితీర ఒకతన్ను తన్ని పోయినా.

[ఈ కథ తెనాలిలోని యువకార్యాలయమువారు నూతనముగ ప్రచురించిన శ్రీయుత పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రిగారి 'రూమ్ టు లెట్' అను ఆరు వినోదకథలసంపుటినుండి గ్రహింపబడినది. ఆధునికాంధ్రకథకులలో ఎన్నదగినవారిలో బాలకృష్ణశాస్త్రిగారు ఒకరు. ప్రస్తుతగ్రంథములోని ఆరుకథలను ఒక్కబిగిలో చదివినచో రెండు ప్రధానలక్షణములు కనిపించును: స్త్రీపాత్రల విలక్షణత, ప్రసాదమైనహాస్యము. తనపై మోహదృష్టి బరపిన నారాయణమూర్తికి 'రూమ్‌టులెట్'లో శ్యామల నేర్పిన గుణపాఠము, 'సంస్కరణం'లోని మధురం సాహసము, 'నేమా నాసీతా'లోని సీత అమాయికమైన నిర్భయత, 'మొదటిసారి'లోని లక్ష్మి కామమును ధనమునకు లొంచ్చుచేయుట—ఆయాకథలను ప్రధానముగా నిర్వహించినవి. ఈ స్త్రీపాత్రలముందు ఆకథలలోని పురుషపాత్రలు ప్రకాశమునకు రాలేదు. ఇక కృష్ణశాస్త్రిగారి హాస్యరచనానైపుణ్యమును తెలిసికొనుటకు 'రంగా యం.,ఏ.' అను కథయు, 'వాసు పాటకచ్చేరీ' అను కథయు చదివితీరవలయును. 'రంగా యం. ఏ' చదువుచుండ పెదవులను దాటనినవ్వు - 'వాసు పాటక చ్చేరీ'చదువుచుండ పెదవులనుదాటివచ్చు పెలుచనవ్వు. ఇట్టి హాస్యరచన తెనుగుకథకులలో తలుచుకాదు. క్రౌనుసైజున నూరుపుటలునిండిన ఈ ఆరుకథల సంపుటి వెల నాలుగు అణాలు మాత్రమే.]

# కారపు శనగలు

పినాకినీతీరాన్ని ఓస్వతంత్రుడు బయలుదేరి ఆంగ్ల భాషాజ్ఞానంలేని ఆంధ్రులు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిసెనేటులో సభ్యులుగా ఉండరాదని నిర్వచిస్తున్నాడు. వంగవిశ్వవిద్యాలయంలో స్నాతకసభోపన్యాసాలుకూడా దేశభాషలో జరుగుతూవుండడం తెలిసికూడా ఈస్వతంత్రుడు ఈవాదం లేవతీయడం బుద్ధిజాడ్యజనితోన్మాదం అనక తీరదు.

... ... ...

'మనయూనివర్సిటీ పరీక్షలు మలపసన్యాసులుకూడ ఓపికఉంటే కొన్నినాళ్లకయినా ప్యాసుకావచ్చును' అని ఒకానొక పత్రికలోని సంపాదకీయవ్యాసంలోని వాక్యం. మన యూనివర్సిటీ పరీక్షలు ఇటీవల ప్యాసైనవాళ్లంతా మలపసన్యాసులై ఉండగా అసలు పుట్టుకతోనే మలపసన్యాసులైన వాళ్లు ప్రత్యేకం ఓపికపట్టి మనయూనివర్సిటీ పరీక్షలు ప్యాసవడం దేనికి?

... ... ...

పైన ప్రస్తావింపబడ్డ పత్రికలోని సంపాదకీయంలోని మరి ఒకవాక్యరత్నం: 'ఈవడుసు ఒక విశ్వబ్రాహ్మడిని అప్పరుచేంబర్కునామినేటు చేయకపోతే విశ్వబ్రాహ్మణులు హిందువులకు తాళిపూసలను చేయమని బెదరించినారు.' బెదరించినా బెదరవలసిన అవసరంలేదని నామనవి. ఏమంటారా ఇప్పుడు పెళ్లిళ్ల తీరు అలాఅయింది. 'ముఖ్యంగా ఏముగ్గురో ఏనైజామో వెళ్లటం–రెండుపూటలుగడిపి రావటం–పెళ్లిఅయిందని పుకారువెయ్యటం!– కారదాపిల్లు.' ఇది ఇప్పటిపెళ్లిళ్ల తీరు. ఈపుకారుపెళ్లిళ్లకు తాళిపూసలతో కాని, అవిచేసే విశ్వబ్రాహ్మలతో కాని ఏమన్నా అవసరంవుందా?

... ... ...

యూరప్‌లో డాన్యూబ్‌తీరాన్ని ఓవ్యవసాయదారుని పెళ్లాం ఇదివరకు రెండుకాన్పులకు ముగ్గురేసి పిల్లల్నికన్నది. ఇపుడు మూడోసారిన్నీ ముగ్గురు పిల్లల్నికన్నది. వియన్నాలో మరి ఒక స్త్రీ ఒకేసారి ఏడుగురు పిల్లల్నికన్నది. స్కాట్లాండులో మరి ఒక స్త్రీ పద్దానుగుకాన్పులకు పద్దానుగు కవలపిల్లల్ని ప్రసవించింది. ఇవన్నీ ఇటీవలజరిగిన విషయాలు. బర్తుకంట్రోలుప్రచారం చేసేవారిని మతిభ్రష్టులుగా చేయటానికిగాను ఇల్లాంటిస్త్రీలను భగవంతుడు భూమిమీదకి ప్రత్యేకంగా పంపిస్తాడనుకుంటాను.

... ... ...

పురుషుని నపుంసకత్వాన్ని పోగొట్టడానికి డాక్టర్ రస్సెల్ ఇ. మార్కర్ (పెన్సిల్వేనియాస్టేట్ కాలేజికి చెందినవాడు) కొత్తగా ఓమందు కనిపెట్టాడు. ఈమందు గర్భవతులమూత్రాన్నుండి చేయబడ్డది. పుట్టునపుంసకులయినా ఈమందును పది రోజులువాడేసరికి మంచిశక్తిమంతులవుతారు. ఈ మందు మోతాదుయొక్కఫోర్సు మూడురోజులదాకా వుంటుంది. ఇదివరకు కోతులఅండాలుపుచ్చుకుని పురుషుడు ముసలితనం పోగొట్టుకోవడం నేర్చుకున్నాడు. ఇపుడు చూలింతరాలిమూత్రాన్నిపుచ్చుకుని నపుంసకత్వాన్ని పోగొట్టుకోవడం నేర్చుకుంటున్నాడు. నాగరికతఅంటే తినరానివి తిని పొందరానివి పొందడమే కాదండీ మరి.

... ... ...

పోస్టుముద్రలతోబాటు మన కవర్లమీదా, కార్డులమీద అప్పుడప్పుడు 'దేశీయపరిశ్రమలను ఉద్ధరింపుడు,' 'ట్రంకుటెలిఫోనుఉపయోగింపుడు' అని ముద్రలు ఉంచడంకద్దు. ప్రస్తుతం గ్రీకుదేశం పోస్టుస్టాంపులమీద 'నిద్రపోండి' అనే వాక్యాలుముద్రించి ప్రచారంచేస్తున్నారు. ఇప్పుడు గ్రీసుదేశంలో నియంత ప్రభుత్వం సాగుతూంది. నియంతలు ఉన్న

చోట నిద్రపోవడానికికూడా ప్రచారంకావాలి.

... ... ...

యస్. యస్. యస్ కంపెనీవారు ఈవేసవిలో కొత్తగా సీజన్‌టిక్కెట్లుఇచ్చారు. మూడవ తరగతి ప్రయాణీకుల ఒత్తిడి ఎక్కువయింది. శీతాకాలపు సీజన్‌టిక్కెట్లలో చలిబాధవల్ల పాశెంజర్లు దగ్గిరసా కూర్చుండి ఒత్తిడిని భరించేవారు. మగదూ పెళ్లామూ కూడా వాళ్ల స్వంతడాబామీద అయినా ఒక మంచం మీద పండుకోడానికి భయపడే ఈఉక్కరోజుల్లో ఒక్కపెట్టెలో పదులకొద్దీపాశెంజర్లు సంఘదాంపత్యాన్ని ఎట్లుభరిస్తారుకి ఈసీజన్‌టిక్కెట్లు ఇచ్చేటప్పుడు ప్రతిసంసారికీ తోచవలసిన ఈసంగతి ఈ కంపెనీవారికి తోచకపోవడం విచిత్రంగానేవుంది.

... ... ...

గతమాసం 19-వతేదీని పారిస్‌లోచనిపోయిన ఆళ్వార్ మహారాజు ఆచారవిషయంలో చూపిన చాదస్తం నవ్వుపుట్టించేదిగా వుంటుంది. అతనికి పాశ్చాత్య దేశంలో వుండడానికి ఏమీ అభ్యంతరంలేదు. కాని పాశ్చాత్యదేశపుతోలు ముట్టుకుంటే తన ఆచారం పాడయిపోతుందని తాను ప్రయాణంచేసేకార్లు పెట్టెలను తోలులేకుండా ప్రత్యేకం విశేషధనవ్యయంతో నిర్మించుకొన్నాడు. ఇది పెద్దచెరువునీళ్లు కుక్కని ముట్టుకోనివ్వకుండా వుంచాలనే ఆచారం లాంటిదే.

... ... ...

విశాఖపట్టణంలోని ఆంధ్రసినెటోన్స్‌లో అరవల ప్రాబల్యం ఎక్కువై అరవసినెటోన్స్‌గా మారుతోందంటూ కొందరు ఆంధ్రులుఅంటున్నారు. కాని వీరు ఎవరూ ఆంధ్రయూనివర్సిటీహాస్టలులో వంటపెద్ద అరవవాడైవున్న విషయానికికాని, రాజమండ్రిలోని ఆంధ్రపేపరుమిల్లు మార్వాడీల హస్తగతమయిన దానికికాని, ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు బుక్కువర్కుకొంత హిందీప్రచారకప్రెస్సువారిచే చేయించినందుకుకాని, ఆంధ్ర ఇన్సూరెన్సుకంపెనీవారి ప్రెస్‌వర్కుకొంత మద్రాసులో అరవలయాజమాన్యంగల ప్రెస్‌లో జరిగినందుకుకాని ఏమీమాటాడరు. ఇపుడు కావలసింది ఎంతసేపూ సినీమాగొడవ.

... ... ...

మే 23-వ తేదీని చనిపోయిన అమెరికన్ కోటీశ్వరుడు జాన్ డేవిసన్ రాక్‌ఫెల్లరు నూటికినూరేళ్లు బ్రతకాలని విశ్వప్రయత్నాలుచేశాడు. కాని తొంభైఏడేళ్లు మాత్రంబ్రతికాడు. ఆయుర్దాయాన్ని పొడుగించుకోవడం కోసం అతను వారాలకొద్దీ బహుధనైకసాధ్యములైన ప్రాణవాయువుతో నింపబడ్డ గదుల్లో నివసించేవాడు. ఎంతడబ్బుఖర్చుపెట్టినా అతనిసంకల్పం నెరవేరలేదు. డబ్బు ఆయుర్దాయాన్ని కొనలేదనడానికి ఇది ఒకమంచి నిదర్శనం.

... ... ...

ఇటీవల ఒకానొకజర్మన్ శాస్త్రవేత్త స్త్రీలలో గొడ్రాలితనాన్ని పోగొట్టడానికి ఒకమందుకనిపెట్టేడు. అతను చెప్పేవిషయం ఏమిటంటే మెదడుకు కొంచెందిగువగా ఒకగ్రంథిలో స్త్రీపురుషులకు సంతానోత్పాదకశక్తి వుంటుంది. ఆపదార్థంతగ్గిపోతే ఆస్త్రీపురుషులకు పిల్లలుపుట్టరు. ఆపదార్థాని సంపూర్ణఆరోగ్యవతి గర్భధారణయోగ్యురాలు అయిన స్త్రీ యొక్క గ్రంథిలోంచితీసి పిల్లలులేని స్త్రీపురుషుల్లో ఎవరికయినా ఇంజక్షన్‌చేస్తే పిల్లలుపుడతారని. దీనివల్ల ప్రపంచంలో ఇక గొడ్రాలితనానికి ఆస్కారం లేకుండాపోతుంది. సంతాననిరోధంచెయ్యడానికి కొందరూ, వంధ్యాత్వంపోగొట్టడానికి కొందరూ శాస్త్రవేత్తలు ప్రయత్నించి మొత్తంమీదప్రపంచాన్ని వెర్రిప్రపంచంగా చేస్తున్నారు.

... ... ...

ఫ్రాంసుదేశంలో పండ్లుతోముకొను బ్రష్షుకు ఆ దేశపుదంతశాస్త్రజ్ఞులు 160-వ వార్షికోత్సవము జరుపనున్నారట. ఈశాస్త్రవేత్తలంతా ఊడిపోయిన దంతానికి గోరీకట్టించిన మహమ్మదుబీన్‌తుగ్లక్ అంశగలవారైయుండాలి.

—వి. విశ్వనాధము, బి.ఏ.



# “ఆంధ్రభూమి” పుస్తకపీఠము

### ౧౮౩. సందేశతరంగిణి

శ్రీవివేకానందప్రవచనము. ప్రథమ ద్వితీయ భాగములు. అమెరికాఖండమునజరిగిన అఖిల ప్రపంచమతమహాసభయందు ఆర్షమతదుందుభిని, వేదాంత మతడిండిమమును మ్రోగించి శ్రీవివేకానందస్వామి వారు హిందూదేశమునకు తిరిగివచ్చి 15-1-1897 లో వారు కొలంబోలో ఓడదిగిరి. అప్పుడు హిందూదేశమునందలి వివిధప్రాంతములవారు వారిని ఆహ్వానించి వారి ఉపదేశామృతమునుగ్రోలిరి. శ్రీస్వాముల వారు కొలంబోపట్టణము మొదలు హిమాలయపర్వతములందలి ఆల్మోరావఱకును; అటుపిమ్మట కాశ్మీర్, పంజాబ్ దేశములందును ఇచ్చిన సందేశపూర్వకములగు ఉపన్యాసములే ఈసందేశ తరంగిణియందు గ్రథితములయినవి. పాశ్చాత్యులనుగూడ తన ఉపన్యాసమహిమచే మోహితులనుచేసిన వివేకానందుని వివేకమహితములగు ప్రబోధవాక్యములను గ్రోల తలంచువారికి గ్రంథము మిక్కిలి సహకారిగా నుండగలదు. తెలుగువారికొఱకు దీనిని ఆంగ్లమునుండి తెనిగించిన తత్వానందస్వామిని కొనియాడవలసియున్నది. అనువాదకశైలి నాతికఠినమై సందర్భోచితమైయున్నది. ఈయుత్తమగ్రంథము శ్రీరామకృష్ణ శతవార్షికోత్సవస్మారకచిహ్నముగ ప్రకటింపబడినది. డెమ్మీసైజున ప్రథమభాగము 250 పుటలు, రెండవభాగము 220 పుటలు-వెల ప్రథమభాగము రు 1-4-0, ద్వితీయభాగము రు 1-0-0. రెండు భాగములును కలిసి రు 2-0-0. దొరకుచోటు: శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మదరాసు.

### ౧౮౪. ఈశ్వరసంవత్సరపంచాంగము

నర్సారావుపేట కాపురస్థులగు బ్రహ్మశ్రీ గొట్టిముక్కల సుందరరామశాస్త్రి సిద్ధాంతిగారిచే గుణింపబడినది. బెజవాడయందలి ఆంధ్రప్రావిడెంటు కంపెనీవారి పక్షమున సదరు కంపెనీ మేనేజింగు డైరెక్టరు శ్రీ దిట్టకవి వీరరాఘవయ్యపంతులుగారిచే ప్రకటింపబడినది. ప్రతిదినము గ్రహముల పరస్పర దృష్టులవలన కలుగు శుభకాలములు, ఫలితములు తెలుపు పట్టిక ఈపంచాంగమందలి గొప్పవిశేషము.

### ౧౮౫. తాళంచెవి తగాదా

బరంపురమందలి నవ్వులతీవ గ్రంథమాలలో ఏడవ పుష్పము. చిన్నసైజున 32 పుటలు. వెల మూడు కానులు. రచయితలు వెలువలి వీరరాఘవస్వామి గారు. స్వామిగారు చక్కని హాస్యరచయితలు. వారు 1928 ప్రాంతములలో రాజమహేంద్రవరమున ట్రెయినింగుకాలేజీలో యల్. టి. ట్రెయినింగు అగుచు అపుడు అచట జరిగిన సాహితీసమితిసభలో 'త్రిగుణములుగల నిచ్చెన' అని ఒక వ్యాసమును చదివిరి. అందలి హాస్యమునకు సభికులు తన్మయులైరి. నాటినుండియు స్వామిగారి హాస్యరచనముల కొఱకు మేము ఎదురుచూచుచునే యుంటిమి. నేటికి ఈ 'తాళంచెవి తగాదా' వెలువడినది. ఇందలి హాస్యము లలితమును, ప్రసాదమును అయినది. అట్టి హాస్యమునకు ఉపయోగ్యవృత్తి కల్గించుటకు స్వామివారు ఇంకను పెక్కుగ్రంథములను రచియింతురుగాక! తమగ్రంథమాలకొఱకు ఇంతటి చక్కని గ్రంథమును సంపాదించి ప్రచురించిన కాంచనపల్లి వెంకటరంగారావుగారిని కొనియాడుచున్నాము.

### ౧౮౬. వెలమవీర శ్రేయోభిలాష

వరశుల్కాచారమును నిరసించు 16 పద్యముల చిన్నగ్రంథము. రచయిత్రి శ్రీ॥ ఆనందమాంబ. ఈమె అష్టావధానముచేయగల ప్రజ్ఞామతి. విద్యావిషయమున మిక్కిలి వెనుకబడియున్న నిజాము

రాష్ట్రమున ఈమాత్రపు వైదుష్యముగల స్త్రీలైనను ఉండుట ఒకవిశేష మనకతీరదు. ప్రతులకు గుండా కృష్ణమూర్తిగుప్త, బారింపటాలం, సికింద్రాబాద్ అని వ్రాయునది.

### ౧౮౭. ఆంధ్రకాఠకోపనిషత్తు

సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు రచియించినది. ఉపనిషన్మంత్రములలోని యభిప్రాయములను, శంకరుఁడు వ్రాసిన విశేషార్థములను, శంకరభాష్య టీకాకారుల యభిప్రాయములను సమన్వయముచేసి వేదాంతరహస్యములను తెనుగుపద్యములందు ఇమిడ్చినందుకు శాస్త్రిగారిని కొనియాడవలసియున్నది. పద్యములు విషయమును సులభముగ తెలుపు శైలిలో నున్నవి. మచ్చునకొక పద్యము :

క. పలుకులవలన, మనమున, చూ
పుల నెవ్వానికిని నాత్మపాదముఁజూపఁ, డికన్
గలఁడనిరొండి విశ్వాసముఁ
గలయాతఁడె కాని యొరుఁడుగనుఁగొనఁడతనిన్.

డెమ్మిసైజున 52 పుటలు. వెల పది అణాలు. వలయువారు గ్రంథకర్తపేర చిట్టాయవలసఅగ్రహారము, గజపతినగరము పోస్టు విశాఖపట్టణము జిల్లా అని వ్రాయునది.

### ౧౮౮. ధాన్వంతరీయఆరోగ్యసూత్రములు

ఇవి పండిత ములుగు రామలింగయ్యగారిచే వ్రాయబడినవి. ఆయుర్వేదాంతర్గతమగు స్వస్థవృత్తములోని ఆహార, విహారవిషయకమగు విజ్ఞానమునంతను ఇందు క్రమపద్ధతిని క్రోడీకరించిరి. శారీరకమానసిక రోగముల వివరణము ప్రత్యేకముగ తెలిసికొనదగినది. దాంపత్యధర్మమునుగూర్చి అమూల్యవిషయములు వివరింపబడియున్నవి. వానిని మే మాసపు ఆంధ్రభూమిసంచికలో ఎత్తి ముద్రించియున్నాము. ఆహారవిభాగమున ద్రవ్యమునకుగల రసగుణవీర్యవిపాకశక్తుల విమర్శగలదు. గ్రంథాంతమున గర్భవతులయు, శిశువులయు ఆహారవిహారములు ప్రత్యేకముగ తెలుపబడినవి. ప్రతివారును శ్రద్ధగ చదువదగిన గ్రంథము. క్రౌనుసైజున 40 పుటలు. వెల రూ 0-2-0. దొరకుచోటు : ఇండియన్ మెడికల్ స్టోర్సు, తెనాలి, గుంటూరుజిల్లా.

### ౧౮౯. అశ్రుమాల

ఎనిమిది చిన్నకథలసంపుటి. ఈకథాసంపుటికి 'అశ్రుమాల' అనుపేరుపెట్టుటకు గల ఉపపత్తిని గూర్చి 'తొలిపలుకు'లో గ్రంథకర్త ఇట్లు చెప్పుచున్నాడు: 'ఒక్కొక్కకథ ఒక్కొక్కఅశ్రువై నా రాల్చితీర్తుందన్నా దొకమిత్రరత్నము. ఆరాలిన అశ్రువులన్నీ ఒకమాలగాగుచ్చి మన ఆంధ్రలోకానికందించాను.' ప్రేమచిత్రము, ప్రణయబంధము, రూపతృష్ణ, నారీహృదయం, నల్లపిల్ల, అక్రమవిభాగము, సహజసౌందర్యము, ఛాయామూర్తి ప్రతీకారము అనునవి క్రమముగా ఈ గ్రంథమునందలి ఎనిమిది కథల శీర్షికలు. ఛాయామూర్తిప్రతీకారము, నల్లపిల్లయున్నగు ఇందలికథలు మున్నొకసారి ఆంధ్రభూమియందు ప్రకటింపబడినవే. సహజసౌందర్యమనే కథతప్ప మిగిలిన కథలన్నియు వ్యవహారిక భాషలోనే వ్రాయబడినవి. సహజసౌందర్యము వ్రాసిన పిమ్మట కథారచనమునకు వ్యవహారికముతప్ప మిగిలినభాష పనికిరాదను సముచితనిర్ణయమునకు గ్రంథకర్త రాగలిగెను. ఇందలి కథలలో పెక్కులు కష్టాంతకములు. అగుటనే ఈకథాసంపుటికి అశ్రుమాల అను నామము సార్థకమైనది. మన సామాజిక జీవితమును అశ్రుమాల దర్పణమువలె ప్రతిబింబించుచున్నదని అంగీకరింపక తీరదు. ఈకథలను రచియించిన శ్రీయుత పెమ్మరాజు రాజగోపాలము (బి.ఏ) గారు సాధనచేసి ఉత్తమజాతి కథారత్నములను సృష్టించి ఆంధ్రభాషాయోషను అలంకరింపగలరని అశ్రుమాల చెప్పక చెప్పుచున్నది. క్రౌనుసైజున 110 పుటలు. వెల 0-8-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర పశ్చిమగోదావరిజిల్లా తణుకు వ్రాయునది.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao, B.A.